# మూడూచేరిన దట్టమైనకొబ్బరినారు తివాసి

## ఎంతో తక్కువ వెల, చాలా విస్తారంగా ఉంటుంది.

మూడూచేరిన దట్టమైన కోయిర్ కార్పెట్ అందమైనది. మితవ్యయమైనవి. బాగా మన్నుతాయి. చెడతొక్కినా అందము చెక్కుచెదరదు. మీ గోడలకు బాగా నప్పుతాయి. మీ కుర్చీ బల్లలకు బాగా నప్పుతాయి. మీకు నచ్చిన డిజైనుకు, రంగుకు నప్పుతాయి. మీ గృహాలంకరణకు ఇంతకంటె మితవ్యయమైనది మరొకటి లేదు. ఇంతకంటే ఎక్కువ రంగులతో రమ్యమైనది వేరొకటి లేదు.

కోయిర్ కార్పెట్లు

మాటింగ్ • మోర్‌జోక్స్ • పైల్ కార్పెట్లు
మీ గృహాలంకరణకు లెక్కలేనన్ని మార్గాలు.



కోయర్ బోర్డు
కొచ్చిన్ 682016

శీఘ్రగతిని కాయర్‌కు అలవాటుపడండి.
మీ సమీపంలోగల కాయర్ డీలరుతో సంప్రతించండి.
కాయర్ బోర్డు షో రూమ్ & సేల్స్ డిపో:
బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా, మద్రాసు, బెంగుళూరు, కొచ్చిన్, మదురై, చండీఘర్, భువనేశ్వర్, హైదరాబాదు, జమ్ము మరియు దేశవ్యాప్తంగా అనుమతిపొందిన డీలర్లు.

SISTAS CB 3/76

# 3 నెలలప్పుడు పాపకు యిచ్చే ఘన ఆహారం మిగతా జీవితపు స్వరూపాన్ని నిర్ణయిస్తుంది;

## కేవలం పాలుయిస్తే చాలదని డాక్టర్ల అభిప్రాయం



డాక్టర్లు సిఫార్సు చేస్తారు

# ఫారెక్స్®

**సంతులిత ఘన ఆహారం**
**త్వరగా సంపూర్ణమైన పెరుగుదలకోసం**



పాపకు 3 నెలలు వచ్చాయంటే, పెరిగే సమయం మొదలైందన్న మాట.

పాప శరీరమూ దానితో బాటే మెదడూ పెరగటం ప్రారంభిస్తాయి. అప్పుడు పాలు మాత్రమే యిస్తే చాలదు. అసలు తల్లి పాల నుంచి మార్చే యీ సమయమే ఎదుగుదల సమయం. సున్నితమైన పాప జీర్ణకోశానికి యింట్లో అందరూ తినే ఆహారాన్ని తిని అరిగించుకునేలాగ చెయ్యాలి. దానికి ఫారెక్స్ యివ్వడం కన్న మించినదిలేదు.

**డాక్టర్లు ఫారెక్స్ యివ్వమని సిఫార్సుచేసే కారణం—**

పెరిగే పాప అవసరాలకు కావలసినది దీనిలో ప్రత్యేకంగా సంతులితం చేయబడటం. ఫారెక్స్‌లో, ఆరోగ్యమైన రక్తమూ, శక్తి ని యిచ్చే యినుము సరియైన ప్రమాణంలో ఉంది— తల్లి పాల నుంచి మార్చేటప్పుడు యిచ్చే ఏ యితర ఆహారంలోనూ యిది యింత సరియైన పద్ధతిలో సంతులితం చేయబడలేదు. ఫారెక్స్‌లో గల కాల్షియం, విటమిన్ డి2 పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టిపళ్ళూ సమకూరుస్తాయి. సరియైన ప్రమాణంలో గల ప్రొటీన్లు, మెదడునూ, శరీరాన్నీ త్వరిత గతిలో పెరిగేలా చేస్తాయి. పాప అవసరాలకు కావలసిన శక్తి యిస్తుంది. అందుకే తల్లులు మిగతా వాటికన్న ఫారెక్స్‌నే ఎంచుకుని యిస్తున్నారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

**ఫారెక్స్, తల్లి పాలనుంచి మార్చే సమయంలోని ఆదర్శ ఆహారం**

వివిధ రకాల ఆహారాలతో కలిపినప్పుడు రుచిగా ఉండేది ఒక్క ఫారెక్స్ మాత్రమే. పళ్ళు, కూరగాయలు, పప్పు, మాంసం, గుడ్లు లాంటి అవసరమైన ఆహార పదార్థాలను ఫారెక్స్‌తో కలిపి పాపకు అలవాటు చేయవచ్చును. మీ పాప వీటిని రుచిగా, యింట్లో అందరితో బాటు యిష్టంగా తింటుంది.

**ఫారెక్స్ పుస్తకం కోసం, రూ. 2 తగ్గింపు పథకం కోసం రాయండి...**

మీ పేరు, విలాసం (ఏ భాషలో పుస్తకం కావాలో రాయండి), దానితో బాటు 25 పై. స్టాంపులు, పోస్ట్ బ్యాగ్ 19119, బొంబాయి 400 025కి రాయండి.




గ్లాక్సో



LIL.GF.53-934 TL

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 14–1–'77
నలనామ సం పుష్య బ. నవమి
సంపుటము 70 : సంచిక : 20
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక


అట్టమీద బొమ్మ
"ముంగిట సంక్రాంతి ముగ్గు"
(చిత్రకారుడు : ఆగాచార్య)

కథలు :

పట్నం బస్ ... 6
తెనుగువారెక్కడ ? ... 32
సృష్టి ... 36
పద్మావతీ విలాస్ ... 42

సీరియల్ కథలు :

ఓ తార కథ ... 13
మగదిక్కు ... 20

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు – 4, ప్రశ్నావళి – 10, స్కోరెంత ? (6), ధర్మపథం – 11, సామాన్యవి సణుగుడు – 12, వారఫలం, రాలిన ముత్యాలు – 16, హైదరాబాద్ నోట్‌బుక్–18 ప్రళయకావేరితో..–22, సినిమా సంక్రాంతి – 25, ఫాలాక్షుని డైరీ–40, వంటలు, లోకంపోకడ–47.


# మనలో మాట

## అందరికీ మా సంక్రాంతి శుభాకాంక్షలు !

*  *  *

ఈసారి "పైవారం" కూడా కొన్ని ప్రత్యేక విశేషాలు వుంటాయి. ప్రతిసారి సంక్రాంతి సంచికలో వేసే ఫిలిమ్ బ్యాలట్ వివరాలు పైవారం వేస్తాము. దీపావళి '76 సంవత్సరం పోటీ కథలపై పాఠకుల 'బ్యాలట్ ఫలితాలు కూడా వచ్చేవారం గెలుపొందిన వ్యాసాలతోసహా అందజేస్తాము. కథా రచయితల పరిచయాలు కూడా అదేసంచిక మనలోమాటలో వుంటాయి.

*  *  *

పైవారం నుంచీ ప్రారంభంకానున్న సీరియల్ "ఇన్‌క్రెడిబుల్ గాడెస్" రచయిత శ్రీ కేశవరెడ్డి వైద్య పట్టభద్రులు. 1947 లో చిత్తూరు జిల్లాలో పుట్టారు. ప్రస్తుతం పుదుచ్చేరిలో ఒక రిసెర్చి ప్రాజెక్టులో 'ఫెలో'గా వుంటున్నారు. వీరు 'యిదివరకు ఒక నవల ప్రచురింపబడిందని మేము వేస్తున్న యీ నవల తమ రెండో రచన' అని తెలియ జేశారు.

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

31.12.76 ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. జయమాలిని ముఖచిత్రం చాలా బాగుంది.

టి. రవీంద్రనాథ్. (అనంతపురం)

### కథలు

31.12.76 నాటి పత్రికలో రైలు ప్రయాణం కథ మా కెంతగానో నచ్చింది. ముఖ్యంగా 'ప్రేమకథలు ఎపుడూ సాఫీగా సాగవు— అలా జరిగితే అవి ప్రేమకథలే కావు' ఈ మాటలు మరుపురానివి. రచయిత్రిగార్కి మా యొక్క కృతజ్ఞతలు. రామలక్ష్మిగారి జవాబులు చాలా బాగున్నవి. ధర్మపథం శీర్షిక ఎంతో విజ్ఞాన దాయకంగా వుంటున్నది. సినిమా విషయాల్లో మా [మా] పత్రికదే ప్రథమ స్థానం అని చెప్పటంలో సందేహం లేదు.

యస్. హర్‌బన్స్‌సింగ్, వై. అశోక్‌కుమార్, (కరీంనగర్.)

*  *

జయమాలిని ముఖచిత్రంతో వెలువడిన పత్రిక మాకు చాలా ముచ్చట కలిగించింది. ఈ వారం ప్రచురించిన రైలు ప్రయాణం, బంధం సంబంధం కథలు మాకు చాలా నచ్చేయి. ఇంకా మనకు రాబోయే పత్రికలో కథలు ఇంకా బాగుంటాయి. అని ఆశిస్తున్నాం.

పి. స్వర్ణలత, (కాకినాడ)

*  *  *

24–12 76 తేదీ విద్యాసిన్హా ముఖచిత్రం అత్యంత రమణీయముగాయున్నది. "సత్యంవధ ధర్మంచర" మరియు "మలోచన ఆలోచన" కథలు ఎంతో చక్కగా ఉన్నవి.

బి. శివలింగం, ఎస్. బద్రి వీరయ్య (సిద్దిపేట)

### సీరియల్

"ఆమెకేం కావాలి ?" సీరియల్ చాలా బాగున్నది. సంస్కారవంతుడు, సహృదయుడు అయిన లక్ష్మణ్‌ను ముందుంచుకొని కూడా సంధ్య ఐశ్వర్యాలకోసం అర్రులు చాచడం చాలా మూర్ఖత్వముగా వున్నది. రచయిత్రిగారికి మా వందనములు

ఎస్. పి. నారాయణ, బి. రత్న, ఎం. మణి పి. లింగమ్మ, పి. రాజమ్మ (జమ్మలమడుగు)

*  *  *

జయమాలిని ముఖచిత్రంతో వెలువడిన 31.12.1976వ తేదీ పత్రిక చదివిన తరువాత ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది. గంటి వెంకట రమణగారి "డాక్టర్ వనిత" సీరియల్ ఆసక్తి దాయకంగా వుంది. కొత్త సీరియల్ మురాల ఇందిరా రమణగారి "ఓ తార కథ" ప్రచురణ చేస్తున్నందుకు

(50 వ పేజీ చూడండి)




ఎండ పెళపెళ లాడుతోంది. అరవటానికి కూడా భయపడుతున్నట్టూ కాకులు విశ్రాంతి తీసుకొంటున్నాయి. రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. దూరంగా కల్లుకొట్టు దగ్గర మాత్రం ఎవరో ఏదో కొనుక్కొంటున్నారు...

పటుత్వం తగ్గిపోయిన శరీరం వైపు వణుకుతున్న చేతి వేళ్ళకేసి ఒకసారి చూసుకొన్నాడు మోచోడు. చేతిలో కత్తి పక్కన పెట్టేడు. ఎదురుగా గుట్టలా వున్న తోళ్ళని పక్కకి జరిపేడు వేళ్ళు విరుచుకొని, గట్టిగా నిట్టూరుస్తూ రోడ్డుకేసి చూసేడు.

రావిచెట్టు క్రింద నీడ దట్టంగా పరుచుకొని వుంది. దక్షిణం నుంచి గాలి అలలు అలలుగా వీస్తోంది.

పడమటి వైపు జారిపోతున్న వయసు గురించి చింత మోచోడికి కలగటం లేదు. ఏదో సాధించిన తృప్తి హృదయం నిండా పరుచుకొని వుంది. బొడ్లోంచి చుట్ట తీసి వెలిగించుకొన్నాడు. మళ్ళీ రోడ్డువైపు దృష్టి సారించేడు బస్సు వస్తున్న జాడ ఎక్కడా కనబడలేదు. దూరం నుంచి నడుచుకొంటూ యాదగిరి వచ్చేడు.

పక్కనే కూర్చొని చుట్ట అడిగి తీసుకొంటూ 'ఏందయ్యా— మంచి హుషారుగున్నవ్?' అడిగేడు.

'ఏమ్లే' అన్నాడేగానీ మోచోడి దృష్టి అంతా రోడ్డుమీదే వుంది. రోడ్డు తిన్నగా సాగి, దూరంగా ఎక్కడో మలుపులో అదృశ్యమైపోతోంది.

'మరి గట్ల చూస్తాంటివే?'

మోచోడు మాట్లాడలేదు మళ్ళీ యాదగిరే అడిగేడు. 'పెద్దోడు వస్తాన్నాడు గీ పర్విసులా?'

తలూపేడు. 'పొద్దున్నే పోయు. వచ్చేదుంది.'

'దేనికి పోయిండు బట్నం ?'

'ఇయ్యాల నౌఖరీలోకి తీస్కునీకి గదేందో వుస్తదంట.'

'ఎప్పుడి ?'

మోచోడు క్షణం ఆలోచించి 'ఇంటరూ' అన్నాడు.

'ఇంటరూ ?'

'గదేరా - ఇంటరూనో...ఇంటవ్యూనో—''

అంతలో దూరంగా దుమ్ము కనబడింది. మోచోడి మొహం విప్పారింది. చుట్ట గట్టిగా పీల్చేడు. బస్సు గర్భిణీ స్త్రీలా నెమ్మదిగా వస్తోంది.

'గైతే పట్నంలా నౌఖరీ జేయిస్తవ?'

'మల్ల గింత సదువు సదివించింది నౌఖరీ జెయ్యనీకి గాక గిట్ల సెప్పులు గుట్టటానికను కొన్నావు ?'

'నీకేమయ్యా ? గీ సుట్టు పక్కల వాయిగు పల్లెలకి నీవొక్కన్వేగాదు మోచోన్వి!. మాసానికి మూడునాల్గు నూర్లు సంపాయిస్తున్నావాయె'

వాడి మాటలకు అడ్డుతగులుతూ 'నే జేసే పనీ చేసేదుంటే వాన్ని గింత సదివించేది దేనికిరా — మూడో క్లాసులో మాన్పించి వుండేది కాదు ?' అన్నాడు.

'ఏంతొస్తదంట తనాకా?'

'అయిదారు నూర్లు రాదంటావు ?' తిరిగి వాణ్ణే అడిగేడు.

'అయిదారు నూర్లు ?'

'మల్లా ? మల్లా అడు సదివింది ఏమను కొన్నవ్‌రా ?...బియ్యే ... సమఝునాది ?' చాలామందికి తరచు చెప్పటంవల్ల - 'బియ్యే' అనే పదాన్ని స్పష్టంగా పలికేడు.

బస్సు వచ్చి ఆగింది క్షణం ఆగి కదిలింది.

పెద్దోడొక్కడే దిగేడు.

తెల్ల షర్టు నల్ల ఫాంటులోకి ఇన్‌షర్ట్ చేసేడు. కాళ్ళకి నల్లటి బూట్లు నిగనిగ లాడుతున్నయ్. చేతిలో సర్టిఫికేట్ల బ్రీఫ్ కేసుంది. ఎర్రటి టై గాలికి అందంగా వూగుతోంది,

దూరం నుంచి తండ్రినీ యాదగిరినీ చూసి పలకరింపుగా నవ్వేడు.

మోచోడు యాదగిరివైపు చూసేడు.

వాడు తనవైపు చూస్తూ వుండటం చూసి, తన ఆత్రుత వాడు గుర్తించకుండా వుండే టందుకు, తను చాలా మామూలుగా వున్నట్టు మొహం పెట్టి ''నాకదే సమఝయిత లేదురా'' అన్నాడు.

'ఏంటయ్యా?'

'ఈ బస్సు పట్నంకు పోయేప్పుడు గింత మందిని తీసకుపోతంది కదా! మల్లాగా పట్నం కెళ్ళి పల్లెకు తిరిగొచ్చేప్పుడు ఖాళీగా వస్త దేందిరా?'

యాదగిరినవ్వి ఏదోచెప్పబోయేడు. ఇంతలో పెద్దోడు వాళ్ళ దగ్గరకొచ్చేడు.

'ఏమైనాదిరా?' మోచోడి కఠంలో ఆత్రుత ధ్వనించింది. పెద్దోడి మొహం పెట్రోమ్యాక్స్ క్యాండిల్ బల్బులా వెలిగిపోతోంది. వచ్చి వాళ్ళ పక్కనే కూర్చోబోయి ఫాంటు నలుగు తుందని భయపడి, నిలబడే అన్నాడు.

'ఉద్యోగ మొచ్చినాదే నాయినా'

మోచోడు ఆనందంతో తబ్బిబ్బు అయి, 'వచ్చినాధి?' అన్నాడు.

'అయితే సెక్కర దినిపియ్యాలె' అన్నాడు యాదగిరి, తండ్రి కొడుకుల వైపుచూస్తూ.

'తినిపిస్త లేదియ్'అని మోచోడు కొడుకు వైపు తిరిగి, 'నువ్‌బో యింటికి. అమ్మకు జెప్పు నేనొస్తగిప్పుడె' అన్నాడు. పెద్దోడు వెళ్ళి పోయేడు.

'గదేంద్యయ్యా— అడు పరీక్ష పూర్తిజేసి రెండేండ్లాయె. ఇప్పుడు దొరికింది. ఎంతుషారు గుండాలె'

మోచోడు తృప్తిగా నవ్వి 'దినిపిస లే— ఇగలే' అన్నాడు. ఎండిన తోళ్ళని చెక్క పెట్టెలోకి తోసేడు. మూకుడులో నీళ్ళు పారబోసేడు. కత్తి,దారం లోపల పడేసేడు. బద్దకం గావళ్ళు విరుచుకొని లేచి,ఇంటివైపు వడివడిగా అడుగులు వేసుకొంటూ నడిచేడు.

* * *

'తన్క రెండు నూర్లా' నిర్ఘాంత పోయేడు మోచోడు. వాడి బలహీన మైన శరీరం ఈ వార్త విని తట్టుకోలేక ఎండు టాకు లా వణికింది.

తలూపేడు పెద్దోడు.

మోచోడికి నోటి వెంట మాట రాలేదు. బ్రీఫ్ కేసు సర్దు కొంటున్న కొడుకుని విస్తుబోయి చూస్తూ వుండి పోయేడు.

అంతలో వాడి తల్లి అక్కడికి వచ్చింది. 'ఇయ్యాలే పోవాల్నందిరా? రెండ్రోజులాగి జేరరాదు?'

'లే—పోవాలె' అన్నాడు పెద్దోడు. ఈ వుద్యోగం కోసం తనెంత కాంపిటీషన్ ఎదుర్కోవలసి వచ్చిందో, రెండు సంవత్సరాల పాటు ఈ మాత్రం వుద్యోగం కోసం తనెంతగా ఎదురుచూసేడో... తల్చుకొంటేనే భయంగా వుంది. అటువంటిది— వెంటనే జేరమని వాళ్ళు అన్నప్పుడు జేరకపోతే ...ఆ కారణంగా వాళ్ళు ఆ వుద్యోగం ఇంకొకరికి ఇచ్చేమనేస్తే—

ఆపైన వూహించలేకపోయేడు. టైమ్ చూసుకొన్నాడు. నాలుగున్నర...ఇంకో అర గంటలో బస్సు.

గబగబా రెండు జతలు పెట్టుకొన్నాడు. ఇంటర్వ్యూకి కట్టుకెళ్ళిన టై ఓ మూల అరలో పెట్టేడు. పెట్లోంచి ఇంకో టై తీసి లోపల పెట్టేడు.

'అయ్యెందుకు రా?' అందివాడితల్లి.

'ఇవి ప్రతిరోజూ కట్టుకోవాలె. లేకుండ బోతె ఊర్కోరు.'

తల్లి మనసు ఆనందంతో వుప్పొంగింది. సూటూ బూటులో కొడుకుని వూహించు కొంది.

పెద్దోడు వంగి బూటులేసులు బిగించు కొంటున్నాడు.

అప్పుడు చూసేడు మోచోడు. అవి తను కుట్టిన బూట్లుకావు. వాడి మనసు చివుక్కు మంది. తన కందంగా బూట్లు కుట్టేది రాదు - అవున్నిజవే — ఆ కంపెనీవోడు కుట్టి నట్లు తనెట్ల కుట్టగల్గుతాడు ?

పెద్దోడు బ్రీఫ్ కేస్ మూసేసేడు.

మోచోడు అతికష్టంమీద నోరు పెగల్చు కొని తన మనసులో భావం బైట పెట్టేడు.

'రెండు నూర్లు తన్కాకి గంత దూరం పోయేదెందుకురా? ఈడ్నే వుండ్రాదు. గా రెండొందలు ఈడ్నే వస యే గదా!'

పెద్దోడు అర్థం కానట్టు చూసేడు.

'ఎట్లొస్తయ్ ?'

'నా పన్జేస్తేరావా ? నే సంపాదిస్తున్నాను గాదు.'

షాక్ తగిలినట్టు నిశ్చేష్టుడయ్యేడు పెద్దోడు. వాడి మొహంలో బాధ, అసహ్యం, రోషం ఒక్కసారిగా నాట్యం చేసినయ్.



# పట్నం బస్సు

'నీ పని జెయ్యమంటావు ?'

'ఏమ్రమ ? రెండు నూరలకన్న ఎక్కువ దొరకదంటావు '

తండ్రి అజ్ఞానానికి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు పెద్దోనికి. సుకుమారంగా వున్న తన చేతులవైపు చూసుకొన్నాడు. తను బి యేలో చదివిన ఎకనిమిక్స్ పాఠం జ్ఞాపకం వచ్చింది: చిన్న గొడుగు కిందో రావిచెట్టు నీడలోనో కూర్చొని చెప్పులు కుడుతున్న దృశ్యాన్ని వూహించుకొన్నాడు. తన పేరు వెనుక బి య్యే డిగ్రీ వ్రాసి, రావిచెట్టుకి మేకు వేసి కొట్టినట్టు కనిపించింది. నవ్వొచ్చింది తండ్రివైపు జాలిగా చూసేడు. ఏదో మాట్లాడబోయేడు అంతలో అతను మాట్లాడదల్చుకొన్నది వాడి తల్లే మాట్లాడింది.

'ఆడు నీ పన్జెయ్యాలె...దిమాఖ్ ఖరాబ్ అయింది? గింత సదువు సదివింది నీ పన్జేసేటందుకున్నావు?'

మోచోడు మాట్లాడలేదు మళ్లీ అందుకొంది.

'దొర లెక్క బట్ట లేసుకొని పన్జెయనీకి పోతాంటే, నీ తీర్న ఎండలో గూసొని పన్జెయ్య మంటావు?'

తల్లి మాటల్తో పూర్తిగా ఏకీభవిస్తున్నట్టు పెద్దోడు మోనంగా వుండిపోయేడు. వాడి మనసులో తను పని చెయ్యబోయే ఎయిర్ కండిషన్డ్ రూము, మెత్తటి సోఫాలూ, వాల్ టు వాల్ కార్పెట్ మెదులుతున్నాయి. నీట్‌గా కట్టుకున్న టై గాలికి ఎగురుతూ వుంటే, అందమైన లైట్ల కాంతి డ్రై క్లీన్ చేసిన బట్టలమీద నుంచి విక్షేపణం చెందుతూ వుంటే...చుట్టూ అందమైన అమ్మాయిలూ ..కిలకిల నవ్వులూ...

'సర్కీసేల కాలేదా?' అన్న తల్లి మాటల్తో ఈ లోకంలోకి వచ్చేడు. క్రాపు సర్దుకొన్నాడు. బ్రీఫ్ కేసు చేతిలోకి తీసుకొని 'పోయొస్తా' నన్నాడు.

'మల్లాదివారం తప్పక రావాలె.'

'గట్లనె' వెళ్లిపోయేడు.

మౌనంగా నిల్చొన్న మోచోడిని భార్య కుదిపింది. 'గట్ల నిలబడతవి సర్కీసుదాకన్న ఆన్తె పోరాదు? నువ్వట్ల పరేషన్‌గ నిలబడ్తె ఆని మనసు బాగుంటది?'

మోచోడు కదిలేడు. కొడుకుతో కలిసి నడవటం ప్రారంభించేడు. చాలాసేపటివరకూ తండ్రి ఏమైనా మాట్లాడతాడేమోనని చూసేడు పెద్దోడు. తండ్రి బాధ. అతనికి అర్ధరహితంగానూ, అనవసరమైనది గానూ కనబడింది. తను వెళ్ళిపోతున్నాడనే విషయాన్ని జీర్ణం చేసుకోవటం కోసం, తండ్రి అంత మౌనంగా బాధ అనుభవిస్తూ వుంటే కొడుకు హృదయం పూరుకోలేక పోయింది. తండ్రి మనసులో బాధని తనకున్న ఎకసెక్కపు పరిజ్ఞానంతో పోగొడ్దామని చూసేడు.

'చూడునాయినా, నేను గింత చదువు చదివిందీ, నువ్వు నాచదువు కోసం ఇంత ఖర్చు పెట్టిందీ గిట్ల నీ పన్జేసేటందుకు కాదు కదా! నేనూ గిట్ల నీపనేజేస్తే, నాతర్వాత నాకొడుక్కూడా చెప్పులు కుట్టేవాడే అయితడు. ఇకంతా, ఇక్కడే, ఇట్లనే సెప్పులు కుట్టుకుంట వుండిపోవాలె. కాదంటావ్'

మోచోడు మాట్లాడలేదు. మళ్ళీ పెద్దోడే అన్నాడు.

'నువ్వన్నదీ నిజమే చెప్పులు కుడూ రెండొందల కన్నా ఎక్కువే సంపాదిస్తున్నవ్. కానీ అక్కడ నాపని వేరు...డిగ్నిటీ ఆఫ్ లేబర్ అంటే—' ఆగి పోయాడు. తనువాడిన పదానికి సరి అయిన అర్థం ఏమిటో తండ్రికి ఎలా వివరించి చెప్పాలో తెలియక క్షణం సేపు తడువుకొన్నాడు...'అంటే...అదే సివిలైజేషను...అంటే...నాగరికత'

మోచోడు రావిచెట్టుకేసీ, పెద్దోడు బస్‌స్టాప్‌కేసీ విడిపోయేరు.

* * *

సూర్యుడు పడమటి కొండల్లోకి జారి పోతున్నాడు. రావిచెట్టు నీడ దట్టంగా పరుచుకొంటూంది. గూటికి చేరుకొంటున్న పక్షుల కలకలం అప్పుడే మొదలవుతోంది.

మోచోడు పెట్లోంచి సూదీ దారం తీసేడు. తోలు నీళ్ళలో తడిపి, కుట్టటం ప్రారంభించేడు.

దూరంగా ఎక్కడో తీతువు పిట్ట ఆగి ఆగి అరుస్తోంది. మువ్వలు గలగల లాడ్తుంటే ఎడ్ల జత ఒకటి పొలం నుంచి పరుగెత్తుకొంటూ వస్తోంది. గొడ్లు కాసుకొనే కుర్రవాడొకడు గొంతెత్తి ఏదో పాడుకొంటూ ఇంటికి సాగి పోతున్నాడు.

మోచోని పక్కనే వచ్చి కూర్చున్నాడు యాదగిరి.

'నీ ఇంటికెళ్తే వస్తున్నా!'

'... ... ...'

'పెద్దోడు ఇయ్యాల్నే పోతున్నాడంట గాదు?'

ఔనన్నట్టుగా తలూపేడు.

ఒక నిముషం నిశ్శబ్దం. యాదగిరి బస్‌స్టాప్ వైపు పరీక్షగా చూసి, 'ఆడు పెద్దోడు గాదు?' అన్నాడు. '...పట్నం బస్సింకా రాలె?'

'రాలె.'

యాదగిరి అటే చూస్తూ 'అడ్ని పట్నం బోవద్దన్నావంట' అన్నాడు

మోచోడు మాట్లాడలేదు.

'అడొచ్చేదాక వుద్యోగ మొస దా రాదా అన్నావ్ స్తివి. వచ్చినాక పోవద్దన్నావ్?'

'... ... ...'

'గట్ల మాట్లాడకుండ గూసుంటివి?'

'ఏం మాట్లాడాలె?'

'అడ్ని నువ్ చేసే పనే జెయ్యమన్నావంట గాదు?'

'హా! చేయమన్న.'

'దిమాఘ్ ఖరాబైనాది?'

భార్య అన్న మాటే వాడూ అనేసరికి మోచోడిలో అణగివున్న ఆవేశం చెలియలికట్ట దాటింది. తుపుక్కున వూసేడు. చేతిలో దారం వదిలేసి యాదగిరి వైపు తిరిగేడు.

'నా దిమాఘ్ ఖరాబైందంటావ్?...నీయవ్వ...నా దిమాఘ్ ఖరాబ్ కా లే ద. — గదో... గాడ నిల్చున్నడు సూడు..ఆడు.. అనికిరా ఖరాబైంది. ఇయ్యాల రెండునూర్లు దొరుకుతున్నయని బట్నం బోతన్నడు...'

'మల్ల నీ లెక్క మూడు నూర్లు సంపాదించేటందుక్కు ఎండలో గూసొని పన్జెయ్యాలె?'

'లే- గట్ల మంచి బట్ట లేసుకొని రెండు నూర్లే సంపాదించమ న- నేనేమొద్దన్నే... నా తీర్పు మోచోన్ల అవ్వమని నేనెందుకంట? కానీ ఆడు గట్ల మంచి బట్టలేసుకొని, మెడకు అది కట్టుకొని పట్నంలా జేసే పనేందో నీకు దెల్సార?... కొను క్కోనే టందుక్కు వచ్చినోళ్ల కాళ్ళకి రకరకాల సెప్పులు తొడిగే ఉద్యోగం!'

యాదగిరి కట్టాటే అయ్యేడు.

మోచోడి ఆవేశం ఆవేదనలోకి దిగింది.

'నువ్వే సెప్పులు స్వయంగ తయారైస్తే నాలీర్న అమ్మరా అంటే ఆనికి స దు వు అడ్డొచ్చినాదంట... దానికన్న ఆ సెప్పుల కంపెనీవో డిచ్చింది. మంచి ఉద్యోగమంట.. ధూ...' వూసేడు. వాడి కంఠం రుద్ధమైంది. దాదాపు ఏడుస్తూ ...'గా సెప్పుల కంపెనీవోడు నా కొడుకుని లాగేసుకొన్నడు. ఇంగ కొంతకాలంబోతే నన్ను లాగేసుకుంటడు' అన్నాడు కంఠంలో నిస్సహాయత ధ్వనిస్తోంది.

పట్నం వెళ్ళే బస్సు వచ్చి ఆగింది. ఒకరో ఇద్దరో దిగేరు. ఎక్కటానికి మాత్రం జనం కుమ్ములాడు కొంటున్నారు.

'సివిలైషనంట . సివిలైషను' గొణుక్కున్నాడు మోచోడు. 



# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**కె. ఆ. కె. బరంపురం**

జీవితం పెద్దదా? మృత్యువు పెద్దదా?

ఎలా చెప్పడం? ప్రతిరోజూ కాస్త జీవితమే అయినప్పుడు? ప్రతిమొలకువా కాస్త పుట్టుకే కద! అలాగే ప్రతి ఉదయం కాస్త వసంతమే కద! తెలిసిన జీవితం కంటే తెలియని మృత్యువు పెద్దదని ఎలా అంటాం?!

**పి. పి. గుంతకల్**

ఇప్పుడు స్త్రీలు ఆడువారా, ఆడేవారా, ఆడించువారా?

ఎప్పుడూ స్త్రీ మమతలకి ఆడుది, భయానికి ఆడేది, జాణతనం చేత ఆడించేదే!

**బి. ఆర్. కె. రాయగడ**

చదువుకొని సంస్కారం వుండీ కూడా మీరు గౌరవం ఇవ్వని వారికి జవాబు లెందుకిస్తారు?

చదువుకీ సంస్కారానికీ లంకె లేదు సోదరీ, చదువురాని వాళ్ళు సంస్కార హీనులు కాదు. ఇక నాకు గౌరవం చూపడం ముఖ్యం కాదు నే రాసినది చదవడం ముఖ్యం అనుకుని సమాధానం ఇచ్చేస్తా.

**బి. బి. ఎస్. భద్రాచలం**

మగువ మానసము మమతల ఆలయము. దానికి మీరేమంటారు?

అవే లేక పోతే ఆడదానికిబానిస మనస్తత్వమే వుండేది కాదు. మమతాను రాగాలను చంపుకో లేకనే ఆడది అన్ని అవమానాలని భరిస్తుంది.

మద్రాసులో తమిళులను చూస్తే మీకేమని పిస్తుంది?

అయ్యో! మనవాళ్ళ లాంటి బ్రతుకుతెరువు పద్ధతులు నేర్చుకోరేం! అనిపిస్తుంది. రెండు చీరలతో, ఒక్కపూట వంటతో పని కానిచ్చేస్తుంది మామీ. ఏ దోసో, ఇడ్లీయో తినేసి అదీ ఆరు గంటలకల్లా హాయిగా ఒంటిగది భవంతిని తాళంవేసి అంతా ఏ కోవెలకో, ప్రీకచేరీకో వెళ్ళి చక్కా వస్తారు! వచ్చే సరికి ఇక నిద్రమ్మే ము కద కరెంటు ఖర్చు తక్కువ. అదే తెలుగాడ బడుచుని చూడండి ఇంటి చాకిరీతో గుండా పిండి అయిపోతుంది. తినా తినక పోయినా, ఉన్నా, అప్పైనాచేసె రెండు మూడు పదార్థాలు వండవలసిందే. అందుకే తమిళులు మనని చూసి "'ఉంగళకు ఆడంబరం జాస్తి' అంటారు!

**ఎస్. పి. పి. కాకినాడ**

మీ అబ్బాయి వర్ణాంతరవివాహం చేసుకుంటానన్నప్పుడు మీ రెలా ఫీలయ్యారు?

అబ్బ! ఒక బాధ్యత తప్పించి పుణ్యం కట్టుకున్నాడు అనుకున్నాను.

**జి. వి. కె. విజయవాడ**

సంకెళ్ళు వేయక నేరగాడు లొంగడు

నిజమే కావచ్చు. కాని ఏ మనిషీ సంకెళ్ళు సహించడు. అవి బంగారంతో చేసినవైనా!

**ఎస్. ఆర్. జె. విజయవాడ**

పెళ్ళిలోనే స్వతంత్ర భావాలు ప్రదర్శించిన స్త్రీ జీవితాంతం భర్తకు అనుకూలంగా వుండడం అలాంటి స్త్రీ.........

బాగుంది. పెళ్ళి అంటేనే నూరేళ్ళ పంట. ముందే తనను చేసుకో దల్చిన వాడెలాంటివాడో తెలుసుకోవాలను కోవడమే స్వతంత్రభావం ప్రకటించడమా! అదా కన్నెపిల్ల కనీసపు హక్కు!

**పి. సూళ్ళూరుపేట**

ఆడది తాను మగాడికంటే తక్కువ అనే నమ్మకాన్ని రోజుకి రోజు పెంచు కుంటుంది కారణం?

ఏముంది ఆయింటి వాతావరణం!...... విన లేదా ఇలా సామెత "మొగుడు కొడితే బాధా కబళం వాడూ కొట్టాడట" ఇంట్లో ఏ స్త్రీకి తగిన గౌరవం దక్కదో ఆ స్త్రీని అంతా చులకన చేస్తారు మరి.

**డి. జి. బి. మిర్యాలగూడ**

మీ ఫోటో ఆంధ్రపత్రిక ముఖచిత్రంగా వేస్తే మేము సంతోషిస్తాం. కాపీలు కూడా ఎక్కువ అమ్ముతాయి కదా?

సంపాదకుల వారి అభిప్రాయం వేరేగా వుండచ్చు బాబూ!

**టి. వి. ఆర్. హైదరాబాదు**

ఈ కవులంతా తొలిప్రేమఘాటుని గురించే వర్ణిస్తారేం?

ఏమోమరి! వారి తొలికవితలే ఉత్తమోత్తమమైనవని కబోలు వారి భావన!

**పి. ఎస్. ఆర్. విజయనగరం**

సాధారణంగా పురాణపరంగానూ, సాంఘిక వ్యవహారాలలోనూ స్త్రీ పేరు పురుషుల పేరు కంటే ముందు వేస్తారు. కాని నేటి సినిమాలలో టైటిల్స్‌లో ముందు హీరోపేరు తరువాత హీరోయిన్‌పేరు వేస్తున్నారు దీన్ని బట్టిచూస్తే సినీరంగంలో స్త్రీ విలువ తగ్గిందంటారా?

అసలు లేదనే దాని అర్థం. అలంకారంగా స్త్రీ పాత్ర కావాలి. కాని హీరో ప్రతి ప్రేమలో, వుండాలి. అందుచేత కథలో 'కర్ర విరగకుండా పాము చావకుండా' అన్నట్టు స్త్రీ పాత్రలు చొప్పిస్తుంటారు. ఆడపాత్ర ఏడవక ఆడప్రేక్షకులు ఏడవరు. ఆడ ప్రేక్షకులు పోషించక పోతే తెలుగు సినిమా "అంతే" అయిపోతుంది. అదీ అసలు కిటుకు!

**బి. ఎస్. ఆర్. కోరాపురం**

పురుషుడు ప్రేమించినంత గాఢంగా స్త్రీ ప్రేమించ లేదు ఎందుచేత?

మీరు ఒక్కవైపే దృష్టి కల్గి వుండడం చేత? అనార్కలీ చనిపోయింది. కాని సలీమ్? చచ్చిపోలేదు సరికదా హాయిగా రాజ్యాన్ని కొచ్చి ఏలాడు!

ముగ్గులు పెడుతున్న ముద్దుగుమ్మలు



# స్కోరెంత? - 6
## ఎన్నో పెళ్లి?

అభినవ "క్లియోపాత్రా"గా వాసి కెక్కి ఒక సినిమాలోనే డాలర్ల కొండమీద కెక్కి కూర్చున్న ఎలిజబెత్ టేలర్ తెర మీద యెంత గొప్పగా చిత్రంగా నటిస్తుందో బయట అంత చిత్ర విచిత్రంగా జీవిస్తుంది. నలభై నాలుగో యేట యింకా అగ్రస్థానాన వున్న యీ తార ఈ మధ్యనే ఏడోసారి పెళ్లి చేసుకుంది. ఆమెను యిటీవలె చేపట్టగలిగిన ధీరుని వయసు ఏభైకి ఒక్క సంవత్సరం మాత్రం తక్కువ. నౌకా శాఖ మాజీ మంత్రిగారైన యీయన పేరు జాన్ విలియం వార్నర్. "లిజ్" కిది ఏడో పెళ్లి సంబరం అయినా, వార్నర్‌కి మాత్రం రెండో పెళ్లి వేడుక- ఆమెగారి మాజీ భర్తల్లో నటుడు రిఛర్డ్ బర్టన్‌కి మాత్రం రెండుసార్లు ఆమె భర్త అనే మార్కెట్ హోదా లభించింది... "క్లియోపాత్రా'గా ఆమె నటిస్తున్నప్పుడు ఆమెతో ప్రొడ్యూసర్‌లు, డైరెక్టర్‌లు పడ్డ పాట్లు రాసి, గ్రంధ రూపంలో వెలువరించితేనే బోలెడు ఆదాయం వచ్చింది! [★★★]

## నవతకు నేతలు

సంతోషం మన సొమ్ముగ
సమభావం మన సొగసుగ
సమతా మమతల పెంచి
ప్రగతి జగతి నడుద్దాము
పాపాలును అంతరించె
తాపాలును తొలగిపోయె
మన పొలుగ మిగిలె నేడు
భూతల భారత స్వర్గమ్ము చూడు
వట్టిమాటల వారుపోయిరి
గట్టి మేలొన గూర్చువారె
నిండుగాను నేడు మిగిలిరి
పండువెన్నెల వెల్లివిరియగ
తిండి పెంచుచు కండ పెంచుచు
మంచి పెంచి సాగిపోదాం
నవ్యభారత స్రష్టలం మనం
రమ్యనతకు నేతలం మనం.

— "సుచంద్ర"




# ధర్మపథం

## ముక్తికి ముఖ్యమైన మార్గం

గమ్యస్థానం ఒకటే అయినా, దానిని చేరే మార్గాలు వేర్వేరుగా ఉండవచ్చును. ఆ విధంగానే ముక్తిని పొందుటకు ఉండే మార్గాలు కూడా వేర్వేరుగా ఉంటున్నవి. వాటిలో ప్రసిద్ధంగా ఉన్నవి జ్ఞానయోగం, కర్మయోగం, భక్తియోగం అనేవి. వీటిలో సర్వజన సులభమైనది భక్తియోగం.

భగవంతుని యెడ భక్తిని చూపడానికి అనేక పద్ధతులు ఉన్నవి. కొందరు నిరతమూ భగవన్నామము స్మరిస్తూ ఉంటారు. కొందరు పెరియాళ్వారు చెప్పినట్లు గృహసమ్మార్జనమో, జలాహరణమో, పల్యంకికా వహనమో, ధ్వజగ్రహణమో, మాలా కైంకర్యమో. అర్చనయో చేస్తూ ఉంటారు. కొందరు పాటలు పాడుతారు. వీటి అన్నింటికంటె జంత్ర,గాత్రాలు సాధనంగా మధురగానం భగవంతుణ్ణి మిక్కిలి ఆకర్షిస్తుంది. తాళ్లపాక అన్నమాచార్యులు, త్యాగరాజస్వామి తమ మధురగానం వల్లనే శ్రీనివాసుని అనుగ్రహాన్ని అత్యల్పకాలంలో పొందినట్లు తెలుస్తున్నది. మధుర గానం సులభంగా భగవంతుని మనస్సును కరిగిస్తుంది. భక్తుడు పాడితే భగవంతుడు ఆడుతాడట!

ఉపనిషత్తులకు ఎంత ప్రాభవ మున్నదో, త్యాగరాజ కృతులకు అంత ప్రాభవం ఉన్నది. అందువల్ల వాటికి 'త్యాగోపనిషత్తులు' అనే ప్రసిద్ధి వచ్చింది. జీవన్ముక్తుడైన త్యాగరాజు 'త్యాగబ్రహ్మ'గా ప్రఖ్యాతిని పొందారు. యాజ్ఞవల్క్య స్మృతిలో ఇలా చెప్పబడింది—

'వీణావాదన తత్వజ్ఞః
కృతిజాతి విశారదః,
తాళజ్ఞశ్చాప్రయాసేన
మోక్షమార్గం నిగచ్ఛతి.'

వీణాతత్వాన్ని తెలుసుకుని దానిని వాయించగలవాడున్నూ, కృతిజ్ఞానం, సంగీత జ్ఞానం కలవాడున్నూ, తాళజ్ఞానం కలవాడున్నూ సులభంగా-ఏట్టి ప్రయాసన్నీ పొందకుండా ముక్తిని పొందగలడని దీని అభిప్రాయం.

మును అందరిలోనూ నారదమహర్షి శ్రీహరికి మిక్కిలి సన్నిహితుడు కావడానికి అతని గాన ప్రావీణ్యమే ముఖ్యకారణం.

భగవదవతారమూర్తి శ్రీరామకృష్ణపరమహంస పరేంద్రుని గానమాధుర్యానికి పరవశులయి సమాధ్యవస్థను పొందుతూ ఉండేవారు. ఎవరు భగవంతుని గురించి మధురంగా గానం చేసినా ఆయన తన్మయులయేవారు.

సింహాచలం లోని వరాహ నరసింహ స్వామి దేవుడు భక్తుడైన కృష్ణమాచార్యుల గాన మాధుర్యానికి పొంగిపోయి నాట్యం చేసే వారని సుప్రసిద్ధమైన గాథ ఉన్నది.

ప్రజాసామాన్యంలో భక్తి భావాన్ని నెలకొల్పడానికి గానమే సరియైన సాధనం.

— బులుసు వేంకట రమణయ్య



# సంక్రాంతిలో 'క్రాంతి'?

ఏనలో చాలామందికి ఉన్నపాటున సంక్రాంతి పండుగ ఎందుకొస్తుందో చెప్పమని అడిగితే గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టుంటుంది! ఎందుకు వస్తుందేమిటి? అన్ని పండుగలూ రాటంలే, యిదీ అంతే-నంటాం కోపంగా... సంక్రాంతికి శలవొస్తుంది. కొత్త బైస్కోపు లొస్తాయి!

చేనేత వస్త్రాలు- చెల్లకుండా పడివున్న నూలు వస్త్రాలు అవీ రిబేటు యిస్తున్నాం రండహో అని అమ్మి పారేయొచ్చునని దుకాణాల వాళ్ళు పోటీలు పడి ప్రకటన లిస్తుంటారు.

ఈ రోజుల్లో ఎవడు పిలుస్తున్నాడు! ఎందరు పోతున్నారుగాని? యీమధ్యనే పెళ్ళయిన కొత్త అల్లుళ్ళు అత్తారిళ్లకు పోతారు- యిదంతా యీ పండుగ 'కళ' 'కళ'!

కాని యిది ముఖ్యంగా రైతు పండుగ! రైతులకు పంట యింటికొచ్చినప్పుడు కలిగే 'క్రాంతి' యీ పండుగ- ఈసారి ఆ రైతు



'తుఫాన్ పులి'నాకి విడిచి పెట్టినవాడై వున్నాడు!

రాష్ట్ర ప్రభుత్వం తుఫాన్ భీభత్సాన్ని చూసింది! కేంద్ర ప్రభుత్వం- పరిశీలక సంఘాన్ని పంపించింది- రైతుకి దేశానికి కలిగిన నష్టాన్ని పూడ్చటానికి కాస్త వోదార్పు కలిగించటానికి కృషి జరుగుతున్న తరుణంలో భోగి పండుగా సంక్రాంతి పండుగా వచ్చాయి!

ఈసారి కోస్తా జిల్లాల్లో జనవరి రాకండానే చలి తీవ్రంగా ప్రవేశించింది. బెజవాడలాంటి వూళ్ళో కూడా 'చలి' పారిపోయి వచ్చిన పెద్దపులిలగా తిరుగాడుతోంది!

సంక్రాంతికి కోడి పందేల బొమ్మలు పత్రికల్లో వేస్తాం..కాంపోజిషన్లలో రాస్తాం.. ఆడకూడదే? వాటిమీద నిషేధం వుంది కనుక పుంజుల్ని పొట్టేళ్లను పెంచి పోటీలు పడేవాళ్లకి- యిటు పందెం నష్టం- అటు పోలీసుల మామూలు నష్టం- తప్ప ఆనందం లేదు- కాకపోతే ఉద్యోగస్థులకి, కరిగిన వాళ్ళకి చతుర్ముఖ పారాయణం మాత్రం- ఏ గాలివాన ప్రభావం లేకుండా యెప్పటిలాగే ఆనందం యిస్తుంది... 'బార్' 'బార్' మళ్లీ మళ్లీ "బార్" లకు పోగల "తడి" దమ్మిడీ వున్న వాళ్ళకి సంక్రాంతి ఐనా ఒకటే క్రిస్‌మస్ అయినా హుషారే...

ఏమైనా సంక్రాంతి వేడుకలు మనమట్టుకి మనకి మొత్తంమీద 'డల్' గానే వుంటాయి! చూద్దాం! ఉగాదికైనా మన పరిస్థితులు బాగుంటాయేమో! అప్పుడు పండుగ మజాగా చేద్దాం. యిప్పుడు కాస్త పొదుపుగా వుందాం!

[పీ రా జీ]



# కళారకేళి

**మురాల ఇందిరాకంయు**

*(గత సంచిక తరువాయి)*

**కా**లం శరవేగంతో గడిచిపోయింది. గంగాధర్‌కి వున్న ఆస్తి అంతా త్రాగుడికీ, విలాసాలకి హారతి కర్పూరంలా హరించుకుపోయింది.

చివరకు ఒక నాటకాల కంపెనీ పెట్టాడు. డబ్బు లేనిదే నాటకాల కంపెనీ మాత్రం సాగుతుందా ? ధనమే ప్రధానంగా వున్న రోజులయివి.

ఒకరోజు నాటకంలో హీరోయిన్ వేషం వేసే ఆవిడ రానందున ఆ నాటకంలో హీరోయిన్ పాత్రని మాలతిని వేయమని గంగాధర్ బలవంతం చేశాడు.

'ఏమిటండీ మీ వుద్దేశ్యం నేను నాటకాలు ఆడాలా మా యింట వంటా లేదు' మాలతి అంది.

''అనవసరంగా రభస చేయక, నేను చెప్పినట్లు విను, లేకపోతే నీ దిక్కున్న చోటికి పో'' అంటూ గంగాధర్ చిందులు తొక్కాడు.

మాలతికి తల్లి చనిపోయింది. వెనకా ముందూ ఎవరూ లేరు. ఇంక గంగాధర్ చేతిలో కీలు బొమ్మగా మారిపోక తప్పలేదు మాలతికి.

ఆ నాటకాలే ఇలా తన జీవితాన్ని మార్చివేసాయి. నాటకాల్లోనించి సినిమాల్లోకి వచ్చి మంచి పేరు గడించుకొంది మాలతి.

*　　*　　*

''ఏమండి ఆ మాలతి బలే రంగులో ఉంది. ఆ ముడి ఏంత బాగుందో చూసారుగా. ఆ కళ్లకు పెట్టిన కాటుక ఎంత అందంగా తీర్చినట్లుగా పెట్టుకొంది. ఆ చెవులకి ఎర్ర రాళ్ళు పొదిగిన పెద్ద పెద్ద దిద్దులు బలే బాగున్నాయి కదండీ'' అంటూ షూటింగ్ చూసివచ్చిన దమయంతి అక్కడి జ్ఞాపకాలను వల్లె వేయటం మొదలు పెట్టింది.

''మాలతి కంటే నీవె అందంగా వున్నావు'' ప్రకాష్ హాస్య ధోరణిలో అన్నాడు. అయినా అందులో నిజం లేకపోలేదు. మాలతే ఒప్పుకుంది తన స్వగతంలో.

''పోండీ మీరు ఎప్పుడూ అంతే! సినిమా యాక్టరు అవ్వాలంటె ఎంత అదృష్టం వుండాలో, కనీసం మనపిల్లడి నైనా సినిమా యాక్టరుని చేయాలి'' అంది దమయంతి. మనకు పిల్లలు లేరుగా అన్నాడు ప్రకాష్.

''పోనీ యిప్పుడు పుడతారు లెండి'' సిగ్గున భిన యించింది దమయంతి.

''ఇంత మంచి వార్త ఇంతాలస్యంగానా చెప్పటం!'' ప్రకాష్ దమయంతిని దగ్గరకు తీసుకున్నాడు.

సిగ్గు ముంచు కొచ్చింది దమయంతికి. స్త్రీకి మొదటిగా గర్భవతి అయినప్పుడు వింతో ఆనందంగా వుంటుంది. అందంగా మారుతుంది. మాతృత్వంలోని తీపి చవి చూడవచ్చని తానుకూడా ఒక ఉన్నత స్థానం ఏర్పరుచుకొవచ్చని ఏవో కలలు కంటుంది. ప్రతి స్త్రీ జీవితంలో అలాంటి ఘడియలు ఏంత మధురక్షణాలో వేరుగా చెప్పనవసరంలేదు.

> *జరిగినకథ 2 :* నా అదృష్టం పగవారికి కూడా వద్దన్న సినీతార మాలతి మాటలు అర్థం కావు దమయంతికి. దమయంతి భర్త ప్రకాష్. అత్త వర్ధనమ్మ. గతంలో...చిన్ననాటి స్నేహితుడు రఘుని పెళ్లి చేసుకోవాలనుకుంటుంది మాలతి. మాలతి కోర్కెను కాదని జమిందారు గంగాధరంతో పెళ్లి జరిపిస్తుంది తల్లి పార్వతమ్మ. గంగాధరం, త్రాగుబోతు, స్త్రీలోలుడు అని మొదటి రోజే తెలుసుకున్న మాలతి కుమిలిపోతుంది.

ప్రకాష్‌కి ఎంతో ఆనందంగా వుంది.

''దమయంతీ నాకు ప్రమోషన్ ఇచ్చినందుకు నీకు ఏమి బహుమతి ఇవ్వ మంటావు.''

''మీరు ఒకమాట ఇవ్వండి. మన బాబును సినిమాల్లోకి పంపుదామండీ. పెద్ద హీరోని చేద్దామండీ'' దమయంతి మనసులోని మాట చెప్పింది.

''పిల్లలను మనం పంపుతే మట్టుకు అక్కడ సినిమా వాళ్ళు తీసుకోవద్దూ. నీలాంటి వాళ్ళు కొన్ని వేల మంది తల్లులు తమ పిల్లలను పంపుతారు'' అంటూ దమ



## ఓతార కధ

యంతి ముంగురులను చేతిలో సవరిస్తూ అన్నాడు ప్రకాష్.

* * *

మాలతి జీవితం ఒక యంత్రంలాగా గడుస్తోంది. ఒకరోజు వంట్లో బాగుండ లేదని రెస్టు తీసుకుంటే గంగాధర్ గొడవ చేసాడు.

"నీవు సంపాదించే రోజులలో అనారోగ్యం అని ఇంట్లో వుంటే కొన్ని రోజులకు ఎలాగూ నీకు రెస్టే అవుతుంది. లేచి బయలుదేరు" అంటూ మాలతిని తొందర చేయసాగాడు గంగాధర్. "ఇవ్వాళ నేను వెళ్ళ లేనండీ, వాళ్ళకు ఫోను చేసి కాల్‌షీట్ కేన్సిల్ చేయమని చెప్పండి," మాలతి మంచంమీద పడు కోవటంతో గంగాధర్‌కి ఎక్కడలేని ఆగ్రహం వచ్చింది.

"ఏమి రోగమొ, చెప్పకుండా రెస్టు రెస్టు, అంటావేమిటి విరుచుకుపడ్డాడు గంగాధర్.

"నేను తల్లిని కాబోతున్నానండీ."

ఏమిటీ నీవు తల్లివికాబోతున్నావా? అలా జరగటానికి వీలులేదు. బిడ్డలు పుడితే నీ గ్లామరు పోతుంది తరువాత బుకింగులే వుండవు, గంగాధర్ గొంతు చించుకున్నాడు.

"ఏమండీ ఎన్నోసార్లు మీరు చెప్పినట్లు విన్నాను. ఈ ఒక్కసారి నా యిష్ట ప్రకారం కానీయండీ." ప్రాధేయ పడింది మాలతి.

"నీముద్దు ముచ్చట తీరటానికి ఒక బాబు వున్నాడుగా. ఇంకా ఎంతమంది పిల్లలు కావాలినీకు." వెంటనే డాక్టర్‌ని పిలిపించి మందులు వ్రాయించి మాలతిని వేసుకో మన్నాడు గంగాధర్.

"ఎందుకండి నన్ను యిలా హింసిస్తారు. మీరు చేయమన్నట్లుగా అన్నీ చేశాను. మీరు వెళ్ళమన్నచోటికి వెళ్ళాను. రాత్రి అనక పగలనక సంపాదించాను. వేలకివేలు తెచ్చి మీకు యిచ్చాను. నా సంపాదనతో "బంగళా" కారు అన్నికొన్నాను నా సంపాదనతో ఇంకా ఎన్నోకొనే దాన్ని. కాని మీ గుర్రపుపందాలకి. బ్రాందీ సీసాలకు, మీ విలాసాలకి, మీ క్లబ్బు పార్టీలకు. డబ్బంతా కర్చు పెట్టేశారు నేను మిమ్మల్ని ఏమి అనలేదు. నాకు మాత్రం ఎంతకాలం వుంటుంది ఓపిక. ఇదంతా నా ఖర్మ. మా అమ్మే అందరిలాంటిదైతే ఎందుకండి నాకు ఈనికృష్టమైన బ్రతుకు.



అందరి లాగా పిలా పాపలతో, ఆఫీసునుండి వచ్చిన భర్తకు, సేవ చేస్తూ వుండాలని ఎన్నో వూహించుకున్నాను. కాని మాఅమ్మ నా జీవితం చేతులారా నాశనం చేసిన పిశాచి" తన ఆవేదన వెళ్ళబుచ్చుకుంది. కాని హృదయంలేని బండరాయి గంగాధర్.

తన తల్లిని గురించిన గాధ మాలతి మనసులో మెదిలింది. కొందరి తల్లులు ఇలా చాలుగా మారటానికి ఎన్నో కారణాలు వుంటాయి. నా తల్లికి డబ్బు పిశాచి పట్టిందే. డబ్బు ఉంటె కొందరు కొండమీద కోతిని దింపవచ్చు అంటారు.

ఎంత డబ్బులోనైనా మనస్సుకు శాంతి ఎక్కడినించి వస్తుంది. కొందరు పశువులు కన్నెట్టుకంటారు. పశువులు బిడ్డలమీద చూపే ప్రేమ కూడా మనుషులు చూపలేరు సరికదా వారి స్వార్థానికి బలిచేసి అమ్మే 'అమ్మవారి'గా తయారవుతుంది.

మాలతికి చిన్ననాటి స్నేహితురాలు సీత కథ గుర్తుకు వచ్చింది.

సీతకి యిద్దరు అన్నలు ఒక తమ్ముడు. సీత నాన్న విపరీతంగా సంపాదించాడు. కూతురంటే అందరూ ఎంతో ప్రేమ చూపే వారు. సీతకు ఒక గొప్ప సంబంధం తెచ్చి పెండ్లి చేశారు. ఒకనాడు చూడకూడని దృశ్యం సీత కళ్ళ బడింది.

"అమ్మా నీవు పెద్దదానివి, యిలా ఎందుకు మారావు?" తల్లిని అడిగింది సీత.

అంతకు ముందు యింట్లో పెద్ద అన్నయ్యది ఖరీదైన వాచీ పరాయి మగవాడికి యిచ్చిన సందర్భంలో కూడా అడగలేదు సీత తల్లిని కానీ ఆ రోజు తల్లిని అలా అడిగే సరికి సీత తల్లి తన గురించి కూతురు తండ్రికి ఏమైనా చెప్పతుందేమోనని సీత భర్త అంటే అల్లుడు, తనను బలాత్కరించినట్లుగా తన భర్తతో చెప్పింది.

దానితో సీత తండ్రి తోక. త్రొక్కిన త్రాచులాగా లేచి నా భార్య పరాయి మగ వాడి గాలి సోకినా సహించని మహాపతివ్రత. నా భార్యను అవమానిస్తావా? ' అని చిందులు వేశాడు కన్నబిడ్డ, తాళిగట్టిన భార్య ఎవరిని నమ్మాలి ? భార్య మాటలే నమ్మాడు. అబద్ధాలు నేర్చిన ఆడదాని మాటలలో అందరూ పడిపోతారు. అందరు తల్లిని మించిన దైవం లేదంటారు. కాని ఈమె విషయంలో తల్లిని మించిన దయ్యం లేదనే విధంగా మారింది. అపార్థాలు అంత భయంకరంగా రక్తసంబంధాలనైనా త్రెంచి వేయగలవు.

సారంగధర నాటకం మనం చూచి ఆనందిస్తాం. కాని పరిణామం ఎంత దారుణమైనదో అనుభవించే వారికి తెలుస్తుంది. అలాగే జరిగింది సీత భర్తకు కూడా.

సీత తల్లి అలా ఎందుకు చెప్పిందో సీతకి ఒక్కదానికే తెలుసు. సీత వస్తే నాకు ఫిట్ వస్తుందని చెప్పటంతో సీత తండ్రికి కూతురు నీడ కూడా గిట్టటం లేదు అంతా అలా మారిపోయారు. నిజా నిజాలు అలాగే నిలిచిపోయాయి.

అయినా సీత కాపురంలో ఎటువంటి గొడవలు లేవు.

మూర్ఖత్వంలో వున్న సీత తండ్రి, అన్నలు ఏనాటికి వాస్తవాన్ని గ్రహిస్తారో, ఆ సర్వేశ్వరునికే తెలియాలి. సీత జీవితాన్ని నాశనం చేద్దామనుకున్న వాళ్లే నాశనం అయిపోయారు, సీత తండ్రిని దొంగ వ్యాపారం చేస్తున్నాడని పట్టుకొని కొన్ని రోజులు జైల్లో వుంచారు. అందరూ అన్ని విధాల మారిపోయారు.

సీత అన్నలు వున్నఆస్తిని తాగుడువగైరాలకు హరించేశారు. సీత తల్లి అహం తగ్గి నెత్తికెక్కిన కళ్ళు మామూలు స్థానంలోకి వచ్చేసరికే ఆస్తి అంతా అయిపోయింది. ఆస్తిలో కొంతవరకు పరాయివారికి వాచీలు, కూలర్లు, ట్రాన్‌సిస్టర్లు లాటి ఖరీదైనవి కొనిపెట్టి పాడుచేసింది ఆమే.

షష్టిపూర్తి చేసుకున్నా చివరకు ఎవరు ఎలాంటి వారో తెలుసుకోలేని మూర్ఖత్వంలోనే వుండిపోయాడు సీత తండ్రి.

కొంత మంది కళ్ళు వుండి చూడలేరు. ఇంట్లో ఎన్ని ఘోరాలు జరుగుతున్నా గ్రహించుకొనే జ్ఞానం లేని వాళ్ళల్లో సీత తండ్రి ఒకడు.

కొందరు యితరుల నాశనాన్ని కోరితే భగవంతుడు ముందు వాళ్ళ నాశనాన్నే కోరతాడేమొమరి.

సీత తల్లి తనుచేసిన చిన్న పొరపాటుకు మొత్తం కుటుంబాన్నే నాశనంచేసింది.

కాని కాలం గుణపాఠం నేర్పలేదు. అలా లోలోన కుమిలి పోసాగింది మాలతి.

"ఏ వండీ నాకు బాబు వున్నాడు ...



**14-1-1977 శుక్రవారం మొదలు**
**20-1-1977 గురువారం వరకు**

# వారఫలం

మహేష్

**మేషం:** అనవసరమైన శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందగలదు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**వృషభం:-** ప్రయాణాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. చికాకులకు గురి కాగలరు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు-ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మిధునం:-** వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో ప్రయాసకు గురి కాగలరు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:-** వ్యాపారంతో ఆదాయంబాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుతుంది. పోటీవారితో వాద ప్రతివాదాలుతగవు. ముమ్ముందు ఉపయోగించగల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం -** పోటీవారిలో గౌరవం బాగుంటుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటలుతగవు. వృత్తిలో ఆదాయం పెరగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు-పుణ్యకార్యాలుచేస్తారు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య:-** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాసి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు- విలాసవస్తువులు కొంటారు. బంధుమిత్రులనుకలుసుకొంటారు.

**తుల:-** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం.** నూతన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బుఅందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**ధనుస్సు** వృత్తిలో శ్రమ కలుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. మీ ఆలోచనలు ఫలించగలవు. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

> ## రాలిన ముత్యాలు
>
> ......శ్రీ సోమసుందర్......
>
> సహగమనాలు పోయాయి సరే,
> వితంతూ ద్వాహాలు వచ్చాయి మరే!
> భ్రూణహత్యలు చట్ట
> సమ్మతాలయాయి-
> ఇంకేం? మరి తప్పవా,
> తప్పని సరిగమనాలు?

**మకరం:** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు. వారంమధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.వారం ఆఖరులో అనుకూల పరిస్థితి ఏర్పడగలదు. స్త్రీలకు-ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం .** అన్ని వ్యవహారాల్లోను గౌరవంబాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది.వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం** అనుకూలమైన వార్తలను వింటారు ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడుతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

---

"పాప" కావాలని వున్నదండి మాలతి జాలిగా అడిగింది. వికృతంగా నవ్వుతూ ఎందుకు ఆడపిల్ల నామాటవిని ఈ మందు వేసుకో" బలవంతం చేయసాగాడు గంగాధర్.

ఆ మందులు వేసుకోకపోతే యింట్లో నరకం సృష్టిస్తాడు గంగాధర్. చేసేదిలేక ఆ మందు వేసుకుంది,మాలతి;మాతృత్వంనాట మరిచిపోక తప్పలేదు మాలతికి.

ఏదో విజయాన్ని సాధించినట్లుగా, ఎంతో సానుభూతిగా"రెస్టు తీసుకో మాలతీ" అంటూ కారులో షికారు బయలు దేరాడు గంగాధర్. మాలతికి మాగన్నుగా నిద్రపట్టింది.

చక్కటి చిన్న బంగళాముందు చక్కటి రాధాకృష్ణుల పాలరాతి విగ్రహం. విగ్రహం ముందు పౌంటెన్‌లో నించి వచ్చే నీరు లేఖ అలలాగా చిమ్ముతుంది.

## ఓతార కథ

బంగాళా చుట్టు విరబూసిన గులాబీలు. బంగళా లోపల చక్కటి ఫర్నిచర్, సోఫాసెట్లు, గోడలకు చక్కటి ఆయిల్ పేయింటింగ్సు బంగళాలోకి ఒక తెల్లటి కారు దూసుకుని వచ్చి ఆగింది. అందులో నుంచి సఫ్రదూపి, తెల్లని స్ట్రెచ్ లాన్ బట్టలు వేసుకుని వుంగరాలు తిరిగిన వొత్తుగా వున్న తుమ్మెద రెక్కలవంటి జుట్టుతో, ఆరు అడుగుల పొడవు, పొడవుకి తగ్గ లావు, తెల్లటి తెలుపు రంగులో వున్న రఘు లోపలికి వచ్చాడు. "కాఫీ" అంటూ కేకలు పెట్టాడు యింట్లోకి.

రతీదేవి లాగా కాఫీ కప్పుతో ప్రవేశించిన భార్యను కప్పుతోపాటు దగ్గరకు తీసుకున్నాడు రఘు ఫాండండీ అంటూ దూరంగా జరగబోయిన భార్య పెదవులమీద తేలికగా ముద్దు పెట్టుకొని వదిలివేశాడు రఘు. అమె అందాలరాసి మాలతి

'ఏమిటి ఈ రోజు బలె హుషారుగా వున్నారు దొరగారు. హాస్పటల్‌కి వెళ లేదా?" శ్రీమతి చిరునవ్వుతో అంది

"హాస్పిటల్‌కి ఎందుకు వెళ్ళలేదు. వెళ్ళాను, అక్కడ నన్ను నీవు నిలవనిస్తేనా? ఈ గొడవంతా ఎందుకులే అని లీవ్ పడేసి వచ్చేసాను" చిలిపిగా చూస్తూ చిన్న విషయంలా చెప్పాడు రఘు.

"నేను నిలవనివ్వక పోవటం ఏమిటండీ" ఆశ్చర్యంగా ఆడిగింది భార్య.

"అబ్బా ఏమిటి డార్లింగ్, నీవు రానక్కరలేదు. నీవు గుర్తు వచ్చావనుకో అంతే కండకి యివ్వవలసిన ఇంజెక్షను, నరాని కిస్తున్నాను" కిలకిలా నవ్వాడు (ఇంకావుంగి)

ఆద్యంతం ఆహ్లాద భరితంగా ఆనందరాగంలో ఓలలాడించే చిత్రం!
తప్పక చూడండి!

ప్రేమ్స్ కంబైన్స్......

# సంసారంలో సరిగమలు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: ఎమ్. ఎస్. కోటారెడ్డి

నిర్మాత: ఎస్. బి. శంకరరావు

నిర్వహణ: ఎస్. అన్నారావు

ఆంధ్ర హక్కుదార్లు: ప్రభాత్ ఫిలింస్

ఆంధ్ర: రఘురామ ఫిలింస్ [ తారకరామా ]

నైజాం: సౌజన్య ఫిలింస్

సీడెడ్: నటేష్ ఫిలిం ఎక్స్ఛేంజ్

THARAKARAMA

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

## శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి

నిరత నిరవద్య నిబిడ నిర్నిద్ర గతిని
చనియె దీర్ఘకాలంబు రాజర్షి తనయ
జీవితంబున, మఱల నిజేశు గనక
వీడని వియోగమున మేను వాడదొడగె

అని శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి తమ 'శాకుంతలము' గీత కావ్యంలో శకుంతలను వర్ణించరు. చక్కని ధారాశుద్ధి, సంప్రదాయాను సరణగల ఈ చిన్న కావ్యం విభాగము, వివాహము, వియోగము, వివాదము అనే నాలుగు పరిచ్ఛేదాలలో కమ్మచ్చులో లాగిన బంగారు తీగలాగ, సౌజన్యం, సరసత, సంప్రదాయశీలత పెనవేసుకొన్న ఆయన జీవితంలాగ కమ్మగా సాగుతుంది. ఇది బెంగుళూరు, మైసూరు విశ్వ విద్యాలయాలలో బి.ఎ.కు పాఠ్య పుస్తకంగాను ఉంది. భారతదేశం స్వతంత్ర కావడానికి ఒక్క రాజకీయోద్యమమే కాక అనేకోద్యమాలు పనిచేశాయి. విద్య, రహదారులు, చేతివృత్తులు, రవాణా సౌకర్యాలు మున్నగువాని క్షీణదశ, కేంద్రీకృత పరిపాలన, నూతన సాంఘిక వర్గాలు, వ్రతికా స్వాతంత్ర్యోద్యమం, సంఘసంస్కరణోద్యమం ఇవన్నీ దోహదం చేయడం వల్లనే స్వరాజ్యం వచ్చిందని ఈయన విశ్వాసం, ఈ విశ్వాసంతో నవభారత యుగోదయం అనే గ్రంథం వ్రాశారు. శ్రీ సూర్యనారాయణమూర్తి రాజమండ్రి తాలూకా నరేంద్రపురంలో 1935 డిసెంబరు 22 జన్మించరు. కాకినాడ పి. ఆర్. కాలేజీలో విద్యార్థిగా ఉన్నప్పుడే 'కాంగ్రెస్' దిన పత్రిక నిర్వహించారు. జనశక్తి అనే పత్రికకు మూడు సంవత్సరాలకు పైగా సంపాదకులు 1955—58. అప్పుడే రచనా వ్యాసంగంలో దిగారు. నాట కాంతం సాహిత్యం అంటారు. కాని, ఈయన 1952లో నిమల అనే సాంఘిక నాటకంతో రచన ప్రారంభించి 'నాటకాద్యం సాహిత్యం' చేశారు. ఇది చాలసార్లు ప్రదర్శిత మయింది. 1953 లో కాకినాడనుంచి వెలువడే ఆంధ్రశ్రీ వారపత్రిక సంపాదకులుగా ఉన్నారు. 1954 లో సాహిత్య సమాలోచన అనే విమర్శ గ్రంథం రచించరు. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో 'ఆంధ్రశ్రీ' అనే సమాచర గ్రంథం (డైరెక్టరీ), సిద్ధ పరిచరు. స్వప్నంలో స్వర్గం (ఎమిలిజోల రచనకు అనువాదం), ప్రేమ భిక్ష అనే ఈయన నాటికలు చలసార్లు ప్రదర్శితమయాయి. మల్లెపూలు కథల సంపుటికి సంపాదకత్వం నిర్వహించరు. తిరుపతిలో ప్రాంతీయ యాత్రిక సమాచర శాఖాధికారిగా వున్నప్పుడు శ్రీనివాస కల్యాణగాథను పద్మావతీ పరిణయమనే చిన్న కావ్యంగా మలిచరు. గాంధి స్మారక నిధిలో గాంధిజీ పుస్తకాలకు అధికారిక అనువాదకులుగా పెక్కు పుస్తకాలు అనువదించరు. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం సమాచార పౌర సంబంధ శాఖలో తెలుగు ప్రచురణలకు సంపాదకులు. ఆంధ్రుల చరిత్రను అజ్ఞాతయుగంనుంచి ఆధునికయుగం దాక వ్రాయతలపెట్టారు. సగం అయింది. ఇది చరిత్ర విషయాల క్రోడీకరణగా కాక సాంఘిక రాజకీయాది గతుల పరిణామంగా ఉంటుంది. సాహిత్యారాధన, సౌశీల్యం రంగరించిన ప్రవర్తన, అకృత్రిమమైన ఆస్తికత్వం, పది మందికోసం పాటుపడాలనే పరమధ్యేయం ఉన్న శ్రీ సూర్యనారాయణమూర్తి ఆంధ్రావళికి ఇంకా ఎంతో సేవచేస్తారు. దాదాపు రెండు దశాబ్దాలుగా ఆయనను చూస్తున్న నాకు ఈ విశ్వాసం ఉంది.

## శ్రీ పి. టి. రెడ్డి చిత్రకళా ప్రదర్శన

సుప్రసిద్ధ శిల్పి, చిత్రకారుడు శ్రీ పి. టి. రెడ్డి 1935 నుంచి 1976 వరకు రచించిన వివిధరీతుల చిత్రాల, గండరించిన శిల్పాల ప్రదర్శనానికి నారాయణగూడలోని సుధర్మ ఆధునిక చిత్రశాలలో కేంద్ర ప్రభుత్వం విద్యాశాఖామంత్రి శ్రీ నూరుల్ హసన్ డిసెంబర్ 16వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు. ప్రజలు తమ జీవిత పరిస్థితులను మెరుగుపరచుకొనడానికి ప్రభుత్వాలు తగిన అవకాశాలు కల్పిస్తున్నాయని ఆయన అన్నారు. అధ్యక్షత వహించిన విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు శ్రీ రెడ్డి చిత్రకళా నైపుణ్యాన్ని ప్రశంసించారు. ప్రారంభంలో లలితకళా అకాడెమీ అధ్యక్షుడు శ్రీ నరోత్తమ రెడ్డి స్వాగతం చెప్పారు. ఆంధ్రప్రదేశ్ కౌన్సిల్ ఆఫ్ ఆర్టిస్ట్స్ కార్యదర్శి శ్రీ డి. దొరైస్వామి వందన సమర్పణ చేశారు. ఈ ప్రదర్శనంలో మొత్తం 550 చిత్ర, శిల్పాలున్నాయి. ప్రదర్శనం మూడు అంచెలుగా జరుగుతుంది. ఇది మొదటి అంచె.

## వివేచన ప్రారంభోత్సవం

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ప్రత్యేక పరిశోధనకోసం ప్రారంభించిన పత్రిక "వివేచన"ను వైస్ చాన్సలర్ శ్రీ జగన్మోహన రెడ్డి డిసెంబర్ 17వ తేదీన ఆర్ట్స్ కాలేజీ హాలులో ఆవిష్కరిస్తూ, విద్యారంగంలో ఉన్నత ప్రమాణాలకు ఉత్తమ శోధనతోపాటు

(48వ పేజీ చూడండి)

సీరియల్

# మగదిక్కు

## పైడిపాటి. సుబ్బరామశాస్త్రి

5

(గత సంచిక తరువాయి)

''ఎమ్. ఏ. పరీక్షకు ఆడవాళ్ళు ప్రయివేటుగా వెళ్ళవచ్చుట! చదవాలని వున్నది, నాన్నా!'' అన్నది సరోజిని.

''ఒకప్రక్క స్కూలులో నెల నెలా పిల్లలకు టెస్టులు, దిద్దవలసిన కాంపొజిషన్ పుస్తకాలు బోలెడు! నోట్సు ఆఫ్ లెసన్సు, ఏవో వ్రాయాలి. ఇంత పని వుండికూడా చదువుతానంటే, చదువు!'' అన్నాడు శేషయ్య.

''ఎల్లాగోఅల్లా తీరికచేసుకు చదివి ఎమ్. ఏ. లని అనిపించుకోవాలని వున్నది నాన్నా!''

''సరే! ఇవాళే అయావనుకో! దానివల్ల ప్రయోజనం?''

''పైకి పోవచ్చు!''

''ఎంత దూరం పోవచ్చును?''

''గీత వున్నంత దూరం!''

''తెలుసుకదా — దేనికయినా గీత ముఖ్యం. చదువుకున్న వాళ్ళెంతమందో, ఆ గీత లేకే అట్టడుగున పడివున్నారు. ఆ వాముపోచంత గీత వున్నవాళ్ళు, ఏమీ రాకపోయినా నెత్తినఎక్కి పెత్తనం చేస్తున్నారు'' అని — తిరిగి ''సరోజినీ!'' అన్నాడు

''ఏమిటి. నాన్నా!''

''నీకు పెళ్ళి చెయ్యాలని అనుకుంటున్నాను. అనుకోవడమే మిగులుతోందికాని, పెళ్ళి మాత్రం కావడంలేదు. నీకు వివాహం యెప్పుడో చేసివుండవలసినది. చేయలేకపోయాను. వ్యాకుల పడుతున్నాను. ఎందుచేతనంటే — పెళ్ళికి పెట్టుబడి పెట్టవలసిన సొమ్ము, చదువుకు పెట్టుబడి పెట్టాను. ఆడదాని విషయంలో పెళ్ళికి పెట్టిన పెట్టుబడే న్యాయమైనది. ఎందుచేతనంటే దాని జీవితానికి ఒక ఆలంబనం దొఅకి స్థిరపడుతుంది. చదువుకు పెట్టుబడి పెడితే ద్రవ్యం వస్తుంది అంతే!

అయితే, భగవదనుగ్రహంవల్ల వుద్యోగం అంటూ ఒకటి దొఅకింది. దొరక్కపోతే అన్నానికి మన పాట్లు కుక్కలూ నక్కలూ కూడా పడేవికావు. గతం నాస్తి. నువ్వు యిప్పుడు సంపాదించుకుంటున్నావు. చదువుకోవాలని వుద్దేశం వుంటే చదువుకో. నీ సంపాదన అంటూ లేకపోతే, నేను నీకు అన్నము పెట్టలేని, పెళ్ళి చేయలేని వ్యర్థుణ్ణి!'' అని ఆగాడు కొంతసేపు.

''తల్లీ! అయితే నీ చదువు నీ పెళ్ళి అయ్యేంతవఅకు మాత్రమే. ఆ తర్వాత నీ చదువు సంగతి నీ భర్త యిష్టం.''

''భర్త యిష్టమంటున్నావేమిటిరా, అన్నయ్యా!'' అని చింపమ్మ యింట్లోకి అప్పుడే అడుగు పెట్టింది.

''భర్త అని అంటే అప్పుడే పెళ్ళి అయిపోయిందనుకుంటున్నావా? అంత అదృష్టమా! మన సరోజిని, ఎమ్. ఏ. కూడా చదువుతానంటోంది. నీ యిష్టం! చదవమన్నాను. పెళ్ళి అయేదాకా దాని యిష్టం. తర్వాత భర్త యిష్టం అంతే కదే!''

''అసలు, నువ్వు దానికి, పెళ్ళి అంటూ ఒకటి చేసేటట్లున్నావటరా! ఎంతసేపూ మా అమ్మాయి బి. ఎ., బి. యిడి. ఉద్యోగం చేస్తోంది సంపాదిస్తోంది. అని చెప్పకు మురిసిపోవడమేకాని, అదీ ఒక ఆడపిల్ల! పైకి చెప్పలేకపోయినా, లోపల పెళ్ళి అయితే బాగుండునని అనుకుంటుంది — అనే ఇంగితం నీకేమయినా ఉందీ? నిన్ను పగలకోసినా ఏ కోశానా కనబడదు.''

''అనవే, చింపీ! అను. నన్ను నీ యిష్టం వచ్చినట్లు అను! నాకేమీ కోపం లేదు. పెళ్ళి చెయ్యాలని నా మనస్సులో లేకపోలేదే! పిల్ల ఉద్యోగంలో చేరిన దగ్గఅనుంచీ, తిరిగి వరాన్వేషణ ప్రారంభించాను. నాకు నచ్చనివి కొన్ని, పిల్లకు నచ్చనివి కొన్ని, చేసుకొనేవాళ్ళకు నచ్చనివి కొన్ని. ఏమయితే ఏం? మొత్తంమీద కుదరలేదు.''

''ఇంతమందికి నచ్చడం అంటే, అదేమన్నా అయ్యేమాటేనా? అవతలివాళ్ళకి నచ్చడం ముఖ్యం. మీ యిద్దరిలో ఎవరికో ఒకరికి నచ్చేటట్లు చూస్తే కొంత శ్రమ తగ్గుతుంది. బాల్యప్రాయం పన్నెండేళ్ళూ, మొగుడొల్లక ముప్పై ఏళ్ళూ, ఆలి ఒల్లక అరవై ఏళ్ళూ గడచిపోతే ఇక కాపుర మెప్పుడని — సామెత!''

''చింపీ! నువ్వు చెప్పిందీ ఆలోచనా భాగంలో పెట్టవలసిందే. ఉద్యోగం చేసే పిల్ల అనేటప్పటికి, వరులు చేసుకోవడానికి ముందుకు రావడంలేదు.

> ***జరిగిన కథ-1:*** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్ళి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్తి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్తి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు.

కొందరయితే ముందుకు వస్తున్నారు కాని, వాళ్ళను గురించి సంతోషించడానికి వీలులేదు. వాళ్ళెందుకు వస్తున్నారు? పిల్ల కష్టపడి సంపాదిస్తే, హాయిగా కూర్చుని తినడానికీ చీట్లపేక ఆడడానికీ వస్తున్నారు. అయితే అల్లాంటివాళ్ళకు కూడా కట్నం కావాలి ఎంతో కొంత. కన్యకు చదువు చెప్పించని తండ్రికి, అవతలవాళ్ళకు పిల్ల నచ్చితే, కట్నం సమస్య ఒక్కటే. కన్య ఉద్యోగిని అయితే పెక్కు సమస్యలు. చేసుకునేవాళ్ళు ముందుకు రాకపోవడం, ముందుకు వస్తే ఇద్దరూ ఒకచోట ఉండడానికి ఎల్లా సాధ్యపడుతుందా అనే ఆలోచన, పోనీ వుద్యోగం మాన్పిస్తే మళ్ళీ అల్లాంటి వుద్యోగం ఇంకొకచోట ఆ పిల్లకు దొరకదనే సంకోచం ఇవన్నీ సమస్యలు. ఉద్యోగిని పెళ్ళికి కూడా కట్నం కావలసిందే! చేతి డబ్బు కాదుకదా! ఆ అమ్మాయి సంపాదించిన డబ్బు కట్నం ఇవ్వడానికేం? రోగమా? అని అంటారు. ఆ అమ్మాయి చదువుమీద ఎంత పెట్టుబడి పెడితే ఆ అమ్మాయి ఆ మాత్రం సంపాదించే స్థితికి వచ్చిందో వారి కక్కరలేదు. చింపీ! చదువుకున్న పిల్లను చూస్తూ చూస్తూ చదువు రానివాడి కియ్యలేముకదా! తిరిగి తిరిగి కాళ్ళు బలపాలు కట్టినై. ప్రయోజనం మాత్రం శూన్యం.''

''అన్నయ్యా! నేను కాలేజీ చదువు వద్దురా అంటే విన్నావా?''

''చింపీ! చదువు ఆపమన్నావు. వెంటనే నీ కొడుక్కి ఇమ్మన్నావు. మీ అబ్బాయి కివ్వడం కోసం చదువు మాన్పించమన్నావనుకున్నాను.''

''మా అబ్బాయికి పిల్లనిమ్మని అడుగకుండా ఉంటే, పై చదువు మాన్పించేటంతటి బుద్ధిమంతుడ వన్నమాట! నీకు ఇతరుల వాకిళ్లలో పడగాపులు పడి తిరిగితే చమ్మగా వుంది గౌరవంగా వుంది. నేను నీ వాకిట్లోకి వచ్చి పిల్లనిమ్మని అడిగితే, నీ గౌరవానికి లోపం వచ్చింది! నువ్వు పిల్లనివ్వనన్న తర్వాత, మళ్ళీ యిమ్మని ఎప్పుడయినా నిన్నడిగానా? నా ఆత్మగౌరవం నాకుంది.''

''అడుగలేదు. అంతవరకు మంచిదానవే. అందుకు సంతోషిస్తూనే వున్నాను. నేను ఆడపిల్ల తండ్రిని కనుక కూతురు పెళ్ళి చేయలేకపోవడం సహజమే. మరి నువ్వు మగపిల్లవాడి తల్లివిగా! నువ్వు చెయ్యలేకపోయావేం?''

''నాయనా! నీ పిల్ల ఆడది కనుక నీ చేతిలో నీ గుప్పిట్లో వున్నది. నా పిల్లవాడు మగనాయన కనుక నా గుప్పిట్లో లేడు. స్వతంత్రుడు — అయినా నేను చెప్పడం మానలేదు. వాడి యిష్టమయినప్పుడు వాడు చేసుకోవలసిందే కాని నేను చేసుకోమన్నప్పుడు చేసుకోడు మేనమామ తిక్క వాడికీ వుంది.

వాడి అంతవాడు వాడు అయాడు. వాడి పెళ్ళి వాడి యిష్టం. నేను బ్రతికి వుండగా వాడు పెళ్ళి చేసుకొని ''అమ్మా! ఇదిగో నీ కోడలు! అక్షతలు వేయమని వస్తే వేస్తాను. లేకపోతే భగవంతుడే వేస్తాడు. ఏమయినా మావాడికి మాత్రం పెళ్ళి కాకపోదు. తండ్రి పోలిక. కన్ను వంకర లేదు. కాలు వంకర లేదు. సంప్రదాయంలో వంపూ టొంపూ లేదు. నోటికి ముక్కలు బాగా వచ్చు.

పేట ఎక్కుతున్నాడు.

ఏ దారే పోయేవాడన్నా, సద్బ్రాహ్మణుడని వీడికి కన్యాదానం చేయకపోడు. ఒకవేళ నువ్వు లెక్కించి నట్లుగా నేను పెళ్ళి చేయలేకపోతాననుకో, బ్రహ్మ చారిగా షష్ఠి బ్రాహ్మణుడికి పనికి వస్తాడు'' చివరి మాటకు సరోజిని నవ్వలేక నవ్వింది.

## *6*

సరోజిని ఎమ్. ఏ. ప్యాసయింది. పంతులమ్మల గదిలో అసూయ ముందు పుట్టి తర్వాత పుట్టిన వారంతా అసూయ పడనేపడ్డారు. కొందఱు సంతోషించారు. వారిలో ప్రథమురాలు సురేఖ. ఆమె సెకండరీ గ్రేడు ట్రయినింగ్ ప్యాసయి వుద్యోగం చేస్తున్నది. భర్తకూ ఆమెకూ పొత్తు లేదనీ, విజయవాడలో, కృష్ణలంకలో, తండ్రిగారి యింటనే వుంటోందనీ చాలామందికి తెలుసు. వివరాలు తెలుసుకోవాలని ప్రయత్నించినవారు విఫలులైనారు. ఆమె ఎవరికీ అధిక ప్రసంగానికి చోటు పెట్టదు.

ఆ రోజున శేషయ్య స్కూలు గేటు దగ్గఱ స్కూలు విడిచే సమయంలో లేడు. సురేఖా, సరోజినీ కలిసి రోడ్డుమీద వెడుతున్నారు

''ఇవాళ మీ నాన్నగారు వచ్చినట్లులేదే!'' అన్నది సురేఖ.

''రాలేదు. ఊళ్ళో లేరు. రాత్రి పొద్దుపోతే కాని రారు.''

''ఇప్పుడు కాస్త తగ్గిందనుకో! మీ నాన్నగారు రోజూ స్కూలుకు రావడంపైనకూడా స్టాఫ్ రూములో వ్యాఖ్యానాలు!''

''నేనేం చెయ్యనండీ! నేను రావద్దని ఎన్నోసార్లు చెప్పాను. మా నాన్న వినరు. నామీద ఆయనకు వల్లమాలిన వాత్సల్యం. నేను యింట్లో కూర్చుని చేసే దేమున్నదమ్మా — అని; బయలుదేరి వస్తారు. ఆయన రాక యితరులకు వింతగా కన్పిస్తుంది. నాకూ యిబ్బంది కల్గిస్తుంది. మనస్సు అసలే విచారంగా వున్నదికదా, నేనుకూడా నొప్పించడం దేనికని ఊరుకుంటున్నాను.''

''భార్యా వియోగం కలిగి చాలా రోజు లయిందిగా!''

''ఆ విచారం కాదు. నాకు పెళ్ళి కాలేదని విచారం. బాధపడితే ఎక్కడయినా పెళ్ళి అవుతుందా, చెప్పండి! కల్యాణ ఘటిక వస్తే అవుతుంది. అందుకని మానవ ప్రయత్నం అవసరంలేదనికాదు. మనం యెంత ప్రయత్నం చేసినా, ఫలితం దైవాధీనం!''

''మీరు చెప్పింది అక్షరాలా నిజం. ఇప్పుడూ ఆ పనిమీదనే వెళ్ళారా?''

సరోజిని నవ్వింది.

''లేకపోతే స్కూలుకు రాకుండా ఒక్కనాటికి వుండరు.''

''నిజమేనండీ!''

ఇంతట్లో సరోజిని నివాసగృహం వచ్చింది.

''లోపలికి రండి సురేఖగారూ! మా యిల్లు చూడనూవచ్చు — కాస్త కాఫీకూడా తీసుకువెళ్ళనూ వచ్చు!''

సురేఖ సరోజినిని అనుసరించింది. ఇద్దరూ కాఫీ సేవించారు.

''సురేఖగారూ! మీరేమీ అనుకోనంటే ఒక విషయం అడగాలనివుంది. మీకు యిష్టమయితే సమాధానం చెప్పండి.''

''మీ కాఫీ సేవించిన తర్వాత, సమాధానం చెప్పనంటే బాగుంటుందా? అడగండి.''

''బలేవారండీ'' అని సరోజిని నవ్వింది. సురేఖ ఎంత గంభీరురాలో, అంత చమత్కారిణి అనుకుంది.

''అది మీ వ్యక్తిగత విషయాన్ని గూర్చే అనుకోండి! మీ భార్యాభర్తలకు పొత్తు లేదనీ, విడిగా వుంటున్నారనీ విన్నాను. నిజమేనా?''

''మీదాకా వచ్చిందన్నమాట — ఆవిషయం! మన స్టాఫ్ రూములో చర్చించని విషయం అంటూ ఏమీ వుండదు. మా ఆలుమగల పొత్తును గుఱించీ, మీకింకా పెళ్ళి కాకపోవడాన్ని గురించీ ఏమేమో చెప్పుకుంటూనేవుంటారు.''

సరోజిని వులికిపడింది. సురేఖ కొనసాగించింది.

''ఆలుమగలకు పొత్తుకూడా వున్న పంతులమ్మలున్నారనుకోండి. అప్పుడు చెప్పుకునేవి వారి దాంపత్య విశేషాలు. ఏదో ఒకటి చెప్పుకోకుండా వుండలేరు. కాలక్షేపం వుండొద్దూ? నోటి తీట అణగవద్దూ! చెప్పుకోవడమే పని! వాళ్ళేమి మాట్లాడుకున్నా వాళ్ళ సంభాషణలలో శ్రుతి కలపను. ఒక చెవి అటు పారవేసి ఊరుకుంటాను. అదికూడా అల్లా పారవేయాలని పారవేయను వాటంతట అవే వినబడుతూ వుంటాయి. మీరూ అంతేననుకుంటాను!''

''అవునండీ! ఎప్పుడూ ఏవో చదువుకు సంబంధించని విషయాలు చెప్పుకుంటూనేవుంటారు. కొందఱు చెవులు కొరుక్కుంటారు, కొందఱు విరగబడి నవ్వుతారు.''

''పొరుగింటి పోరు విన వేడుక. ఎవరయినా, ఏదయినా, యిబ్బందిలో వుంటే, వారి పట్ల సానుభూతిని చూపడానికి బదులుగా, దానిని గోరంతలు కొండంతలుచేసి చెప్పుకుని సంతోషించటం మనలో కొందఱికి సరదా! యీ వ్యాధి పల్లెటూరి వాళ్ళలోనే వున్నదనుకునేదాన్ని



# ప్రళయ కావేరిలో ప్రయోజనాత్మక ప్రయోగాలూ - పరిశోధనలూ

- డా॥ ఎస్. జయదేవ్‌బాబు

దక్షిణ భారతదేశంలో ఆంధ్ర – తమిళనాడులను కలిపే మహా సరస్సు వున్నది. సుమారు 178 చదరపు మైళ్ల విస్తీర్ణం కలిగిన యీ సరస్సు పేరు "పులికాట్ లేక్". ఇది దేశంలోని మహాసరస్సులలో రెండవది.

మద్రాసు నగరానికి 35 మైళ్ల దూరంలో వున్న "పళవేర్కాడు" పల్లె పొలిమేరలలో యీ సరస్సు బంగాళాఖాతంతో కలుస్తున్నది. సరస్సు




మధ్యన రెండు చిన్న ద్వీపాలు "వేనాడు", "ఇరకం" ఉన్నాయి. వీటిలోనూ, సరస్సు మధ్యన యెన్నో చిన్న చిన్న బెస్త పల్లెలు ఉన్నాయి.

పులికాట్ సరస్సు చేపలకూ, రొయ్యలకూ, ఎండ్రలకూ ప్రసిద్ధి. రోజూ కొన్ని వందల టన్నులలో యీ జలచరాలు, యీ సరస్సు నుంచి దేశంలోని వివిధ ప్రదేశాలకూ, యితర దేశాలకూ కూడా రవాణా ఔతాయి.

డచ్ దేశస్థులు మన దేశం వచ్చినప్పుడు ప్రప్రథమంగా వారి స్థావరాలు యీ సరస్సు సరసన వున్న పళవేర్కాడులోనే యేర్పరచుకొన్నారు. వారి



లాబరేటరి

కోటలూ, సమాధులూ యింకా యీ పల్లెలో శిధిలావస్థలో మనకి కనపడతాయి.

పూర్వం నెల్లూరు రెడ్డిరాజులకు, యీ సరస్సునుంచే, చేపలు సరఫరా చేసేవారట. వారి ఆస్థాన కవులు పులికాట్ సరస్సును "ప్రళయ కావేరి"గా వర్ణించారు. దీనికి సంబంధించిన వివరాలు, పళవేర్కాడులోని కొన్ని దేవాలయాల్లోని శిలాశాసనాల మీద మనకి దొరుకుతాయి.

పులికాట్ సరస్సు 1960వ సంవత్సరందాకా మన దేశపు జీవశాస్త్రజ్ఞులకు దూరంగా వుండిపోయింది. ఆ సరస్సులోని జీవరాసుల మీద ప్రప్రథమంగా పరిశోధనల కుపక్రమించింది డాక్టర్ సంజీవ రాజుగారు. నంద్యాల వాస్తవ్యులైన వీరు ప్రస్తుతం మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో డీన్ ఆఫ్ సైన్సెస్‌గా వుంటున్నారు. విదేశాలలో పై చదువులు ముగించుకుని రావడంతోటే, తమిళనాడు ప్రభుత్వంతోను, విదేశ మిషనరీలతోనూ సంప్రదించి, వారి సహకారంతో దేశంలోనే తొలి "యెస్ట్యురైన్ బయాలాజికల్ రీసెర్చి లాబొరెటరీ" పళవేర్కాడులో స్థాపించారు.

1968లో నిర్మించబడిన యీ లాబరేటరీలో చాలమంది పరిశోధకులు ప్రస్తుతం సరస్సులోని జలచరాల మీద తీవ్ర పరిశోధనలు జరుపుతున్నారు. వీరి పరిశోధనా ఫలితాలు బెస్తవాళ్ల వృత్తి విధానాలకి ఎంతో ఉపయోగపడుతున్నాయి. సరస్సులో చేపలు, రొయ్యలు, ఎండ్రల పెంపకం, తద్వారా వాటి ఉత్పత్తిని పెంచడానికి తీవ్రమైన కృషి జరుగుతున్నది.

రేడియో ఆక్టివిటీ వల్ల ఏర్పడే దుష్ఫలితాలు (కల్పాక్కం సమీపంలో) ఎంత ఉధృతమైనవో అంచనా వేయడానికి పులికట్ సరస్సులోని పరిశోధనలు కొలబద్దలుగా వుంటాయి. ఇప్పటికే చాలమంది పరిశోధకులు పిహెచ్.డి. డిగ్రీలు పుచ్చుకున్నారు.

బి. ఎస్‌సి; ఎం. ఎస్‌సి. జూవాలజీ విద్యార్థులు ప్రతి యేటా వివిధ ప్రదేశాలనుండి యీ సరస్సులోని జీవరాసులను పరిశీలించడానికి పళవేర్కాడుకు వస్తుంటారు. లాబరటరీలో విద్యార్థులకు అన్ని సౌకర్యాలూ కల్పించారుకూడా...

## మంగదిక్కు

ఇక్కడా వున్నది. చదువుకూ సంస్కారానికీ ఏమీ సంబంధం లేదు."

"బాగా చెప్పారు."

"బాగా అన్న బాగానా? చాలా బాగా చెబుతున్నాను. "పిల్లికి చెలగాటం — ఎలుకకు ప్రాణసంకటం" అన్నట్లు వారి ప్రసంగాలలో ఆనేకులను గూర్చి అనేక విషయాలు వస్తూ వుంటాయి. వాళ్ళ కది సరదా! ఒక మనిషిని పరోక్షిన విమర్శిస్తూ చులకన చేయడం గొప్ప తెలివని వాళ్ల అభిప్రాయం."

"నిజం."

"పోనీ యీ కలిసి మాట్లాడేవాళ్ళంతా ఒక 'కట్ట' అని అనుకుందామా అంటే అదేమీకాదు. వాళ్ళలో కొందఱు అక్కడ లేనప్పుడు, మిగిలినవారు వారినిగూర్చి కూడా చెప్పుకుని నవ్వుకుంటారు. ఇదొక దురభ్యాసం.

"ఉద్యోగాలుచేసే వాళ్ళలో, యీ స్కూలులో భార్యాభర్తలుకూడా వున్నారు. భార్య యీ స్టాఫ్ రూములో వుంటే, భర్త ఇంకొక స్టాఫ్ రూములో వుంటాడు. ఇక్కడి విషయాలు భర్తతో చెప్పకుండా భార్య గుట్టుగా వుంచుతుందని ఎల్లా అనుకోగలం? ఆ భర్త తన స్నేహితులతో ఆ మాటలు ముచ్చటించడనిమాత్రం ఎల్లా అనుకుంటాం? కనుక మన స్టాఫ్ రూము మాటలు మగవాళ్ళదాకా వెడితే వాళ్ళు మనల్ని ఎంత తేలికగా ఊహించుకుంటారు! అందుచేత నోరు కట్టుకోవడం అందరికీ క్షేమం. ఆ పని వాళ్ళు చేయరు. అసలు ఆడది వుద్యోగానికే బయటకు వెళ్ళకూడదు కర్మకాలి వెళ్ళవలసివస్తే, అక్కడ ఎల్లా బ్రతకాలో నేర్చుకోవడం అనేది ఒక ప్రత్యేక విద్య. ఆ విద్య తెలియకపోతే, తోటకూరలో పురుగుకంటె కూడా హీనమైపోతాం."

సరోజిని తెల్లబోయింది. తాను ఆమెను గూర్చి ప్రస్తావిస్తే, ఆమె స్టాఫ్ రూమును గురించి చెప్పి, నా విషయం నీ కనవసరం అన్నట్లుగా మాట్లాడుతోందని అనుకుంది.

"సురేఖగారూ! ఏదో తెలియక మీ సొంత విషయం అడిగాను. మీకు బాధగా వున్నట్లుంది. క్షమించండి" అంది.

సురేఖ నిట్టూరుస్తూ అల్లా వుండిపోయింది. రెండు కన్నీటిబొట్లు రాలినై.

"మీకు కష్టం కలిగించాను. క్షమించండి" అన్నది సరోజిని.

"ఓ సరోజనమ్మా! నేను స్టాఫ్ రూము విషయం ఎందుకు ఎత్తానంటే, నన్ను గురించి వారు ఎల్లా చెప్పుకున్నారో, అల్లాగే మిమ్మల్ని గురించి కూడా చెప్పుకుంటూనే వుంటారనే సంగతి మీరు గ్రహిస్తారేమో అని. వాళ్ళను అర్థంచేసుకుని జాగ్రత్తగా ఎల్లా మెలగాలో ఆలోచించుకుంటారని. అదీకాక నా విషయం ఎవరయినా ప్రస్తావిస్తే నాకు బాధ కలిగే మాట నిజమే. ఆ బాధలో నేను నేనుగా వుండను. అందుచేత ఆ ప్రస్తావనే నాకు యిష్టంగా

వుండదు. మా ఇద్దరి మధ్యా, పొత్తు లే–దు. ఇది నిజం !"

"నేను పొరబాటున అడిగాను. అంత బాధాకరమైన గాథ చెప్పవద్దు" అన్నది బిక్కముఖంతో సరోజిని.

"ఆ బాధ నాలో గాఢంగా, గూఢంగా వున్నది. ఎవ్వరయినా ప్రస్తావించినప్పుడు పైకి వస్తుంది. గాథలో బాధ లేదు. నాలో వున్నది. మీ నాన్నగారు యిప్పుడు రారుగా !"

"రారు"

"మళ్లీ ఇంకొకమాటు కాఫీ పెట్టి యిస్తారా ?"

సరోజిని పెట్టి యిచ్చింది. సురేఖ తీసుకుంది.

"థాంక్స్"

"నో మెన్షన్"

"ఏమిటో! రోజు లిలా గడచిపోతూ వుంటాయి. అప్పుడే పదిహేనేళ్లు దాటిపోయింది – మేము ఎడమైపోయి. సూర్యుడు అప్పటినుంచీ, అంతకు ముందునుంచీ, ఉదయిస్తూనే వున్నాడు, అస్తమిస్తూనే వున్నాడు. ప్రతి దినమూ జీవుల ఆయుర్దాయం హరించిపోతోంది. చిన్నపిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. పెద్దవాళ్లు ముసలివాళ్లవుతున్నారు. ముసలివాళ్లు కనబడకుండాపోతున్నారు. కాలం అనేది ఎంత శక్తిమంతమైనది ?"

సరోజినికి వెంటనే తన వయస్సు జ్ఞప్తికి వచ్చింది. తానుకూడా త్వరలో ముసలిదానినయిపోతానేమో అని భయపడింది. ఆ ఆలోచనలోనుండి తేరుకోకముందే –

'సరోజినీ !' అని పిలిచింది సురేఖ.

ఉలికిపడి చూసింది సరోజిని.

"నేను రోజూ బొట్టు పెట్టుకోడానికి అద్దం చూసుకుంటాను కదా! అప్పుడు ముఖం అంతా పరిశీలనగా చూస్తాను. వయస్సు మళ్లిన రేఖలేమయినా ముఖంమీద కన్పిస్తున్నవా ? అవికూడా చూస్తాను. మొన్న నా కాశ్చర్యం కలిగింది. సగం నెరసిన వెంట్రుక నా తలలోనే కన్పడింది. వెంటనే పెరికివేశాను.

కాని, సరోజినీ! ఆ వెంట్రుక తలలోనుండి పోతే, వయస్సు మళ్ళిన లక్షణం పోయినట్లేనా ? పాపం ! వెంట్రుకలో ఏముంది ? అది ఆ లక్షణాన్ని చూపించే చిహ్నం మాత్రమే !"

సరోజిని వెర్రి చూపులు చూస్తూ తన విషయం ఆలోచించుకుంటోంది.

"ఏమిటి సరోజినీ ! నీ విషయం ఆలోచించుకుంటున్నావా ?"

సురేఖకు ప్రసంగంలో మీరు అనడం కాస్తా నీవు అనడంలోకి వచ్చిందనే గమనిక లేదు. సరోజిని ఆమె వయస్సులో పెద్దది కనుక పట్టించుకోలేదు. తనను ప్రశ్నించేటప్పటికి గతుక్కుమంది.

"ఎవరి విషయమయినా, అంతేనమ్మా, సరోజినీ ! ఒక క్రొత్త కారు కొన్నామనుకో. వాడకుండానే దానిని షెడ్డులో పెట్టామనుకో. ఇరవైయేళ్ళ తర్వాత దానిని బయటకు తీస్తే, ఎంత ఆయిలింగు చేయించినా, దానిని పాతమోడలు కారు అని అంటారుకాని క్రొత్తమోడలు కాదుగా!"

సరోజిని వణకిపోయింది. తాను పెళ్లి చేసుకోకుండా వుండడం ఎంత తప్పో ఆలోచించుకుంటోంది.

"ఎంతో పాపం చేస్తేనేకాని, భార్యాభర్తలకు ఎడబాటు రాదంటాను. ఏమంటావ్ ?" అన్నది సురేఖ నిట్టూరుస్తూ చూపుడువేలుతో ఎదురుగా వున్న బల్లపై సున్నాలు చుడుతూ.

సరోజిని ఏమనగలదు ? నిజమే అని అంటే సురేఖను పాపిగా ఎత్తిచూపించినట్లవుతుంది. ఆమె హృదయపూర్వకంగా చెప్పే మాటను కాదనగల శక్తి తనకు లేదు. ఒకవేళ కాదంటే, ఏదయితే పరమసత్యమని సురేఖ భావిస్తోందో, దానిని తాను కాదన్నట్లు అవుతుంది. పాపపుణ్యాలనేవి అసలు సృష్టిలో లేవంటేనేకాని, ఆమె చెప్పింది కాదనడానికి వీలులేదు. సరోజిని అలా అనగల మనిషి కాదు – అనే మనిషీ కాదు.

"నేను చెప్పిందల్లా నువ్వు ఔనను సరోజినీ ! నువ్వు అలా అంటేనే, నేను చెప్పడం కుదురుతుంది."

సురేఖ తనకు మార్గం చూపినందుకు సరోజిని సంతోషించింది.

"నిజమేనండీ !" అన్నది పెగుల్చుకొని.



"నిజం చెప్పావు." అని, సురేఖ తృప్తిగా నిట్టూర్చింది. చెప్పడం ప్రారంభించింది :

"నాకు తెలిసినప్పటినుంచీ మాది గుంటూరు. మా నాన్నగారిది గంపంత సంసారం. అందులో నేనూ ఒక ఆడపిల్లను. నాకు చిన్నప్పుడే పెళ్లి చేశారు. మా వారిది పలనాటిసీమలో చిన్న అగ్రహారం. కొంత మంచి ఆస్థి వున్న సంబంధమే. మెరక ప్రదేశం. పంటలు నమ్మకం లేనివి. పండినప్పుడుమాత్రం విరగపండుతై. వరిపంటలేదు. వర్షాధారంతో జిలుగుబుడమలాంటి వడ్లు పండుతై. ఒకప్పుడు అవీ పండవు. అందుచేత కలవాళ్లు రెండు మూడు సంవత్సరాలకు సరిపడ వరిధాన్యం గాదుల్లో నిలువ చేసుకుంటారు. మా అత్తవారు కలవారి క్రిందే లెక్క – మావారు మా అత్తమామలకు ఏకైక పుత్రులు."

"అలాగా !"

"ఈ సంబంధానికి నన్నివ్వడంలో మా నాన్నగారికి కొన్ని అభిప్రాయాలు వున్నవి. మావారిని గుంటూరులో ఇంగ్లీషు చదువుకుగాను అట్టేపెట్టుకోవడం, తర్వాత బస్తీలోనే వారికి వుద్యోగ ప్రయత్నం చేయడం, నేను వుద్యోగపు ఊరిలోనే కాపురం చేస్తూ, పలనాడు వెళ్ళవలసిన అవసరం లేకపోవడం; వెడితే చుట్టపుచూపుగా వెళ్ళడం, మామగారు అప్పటికే గతించారు కనుక, అత్తగారు ఒక్కర్తె కొడుకునూ కోడలినీ వదిలి వుండలేక క్రమంగా బస్తీ చేరడం, తర్వాత పొలాలు మార్చి బస్తీలో స్థలాలూ యిల్లూ కొనుక్కోవడం."

"బాగుంది !"

"ఏమి బాగుంది ? అదే నా కొంపతీసింది !"

చెప్పినదానికల్లా ఔననమని సురేఖ అనడంవల్ల, సరోజిని బాగుందని అన్నది. అలా తాను చెప్పిన మాట సురేఖ మరచిపోయింది.

"అదేమి ?"

"ఇలాంటి వుద్దేశాలు వున్న మా నాన్న, తన అల్లుడు గుంటూరులోనే వుండి, ఇంగ్లీషు చదువు చదివితేనే పిల్లనిస్తానని కచ్చితంగా ముందు చెప్పవద్దూ ?"

"చెప్పాలి."

"అలా చెప్పకపోతే మా అత్తవారికేమి తెలుస్తుంది ? లోకమో, పాడో! అందరి కోడళ్ల మోస్తరుగా తమ కోడలు కూడా పలనాటి సీమకు కాపురానికి వచ్చి, ఇల్లు వెలిగిస్తుందని సంబరపడ్డారు. సంప్రదాయం మంచిది కదా, పిల్ల బాగున్నది కదా, అని చేసుకున్నారు. మా నాన్నవాళ్ల ఆస్తికి ఆశపడి పిల్లనిచ్చాడు. అక్కడ మగదక్షత గల పెద్దలు లేరుకదా, వారు చిన్నవారుకదా, మనం చెబితే వినకపోతారా–అని మా నాన్న అనుకున్నాడు."

"అరరే !"

"మా నాన్నేమో, వారికి వేయినూటపదహార్ల కట్నం చదివించాడు. వారయితే అసలు కట్నమే కోరలేదు. చదివించినవాడు వాళ్ల కట్నం సొమ్ము వాళ్లకు అప్పటికప్పుడు ఇవ్వలేదు."

"పేచీలేమయినా వచ్చినవా ?"

"లేదు. వారేమో ఆ వేయినూటపదార్లే నగల క్రింద చదివించేశారు. ఆ కాలంలో వేయి నుండి నాలుగు వేల దాకా కట్నం యిచ్చినా, నగల క్రింద పెట్టడం నాలుగు వందలే, పది వేల రూపాయల కట్నం పుచ్చుకున్న వారేమయినా, వేయినూట పదహార్లు నగల క్రింద యిచ్చేవారేమో ! మావారు కట్నం సొమ్మంతా నగల క్రిందే యిచ్చేశారు."

"ఆశ్చర్యం"

"మావారికి తల్లిని, జన్మ ప్రదేశాన్ని వదలి,

## మగదిక్కు

మామగారింట్లో చేరి ఇంగ్లీషు చదవాలన్న అభిప్రాయం లేదు. అన్నోదకాలకు లోపం లేని ఆస్తి వుంది. వ్యవసాయం వుంది కొంత డబ్బు నిల్వ వుంది. సంస్కృతం కొంత చదువుకున్నారు. కొంత వైదికపు ముక్కలు చెప్పుకున్నారు."

"అభిప్రాయాల్లో, అవగాహనలో తేడా వచ్చిందన్న మాట! ఇంతకూ మీ ఊహ ఏమిటి?"

"నాకు అప్పట్లో ఏ ఊహా లేదు. ఎల్లాగయితే ఏం, కార్యం చేశారు. ఆ సందర్భంలో కూడా అత్తవారింటికి వెళ్లి మూడు రోజులున్నాను. మా అత్తగారు చాలా మంచిది. నేను పుట్టింటికి వచ్చిన తర్వాత మా నాన్న నన్ను కాపురానికి పంపనే లేదు వారే ఒకటి రెండుసార్లు కాబోలు వచ్చారు."

"మీవారు మీతో అనుకూలంగా ఉండేవారా?"

"చాలా!" అని సిగ్గుతో సురేఖ తల వాల్చేసింది. కాసేపాగి "మా నాన్న నన్ను పంపకపోతే బిక్కముఖంతో వెళ్లిపోయారు. నాకు ఏడుపొచ్చింది. మా నాన్న అంటే వున్న భయంతోనూ, సిగ్గుతోనూ, వారితో కూడా వచ్చేస్తానని అనలేకపోయాను. అప్పుడే అల్లా అనగలిగివుంటే, నా జీవితం యిప్పుడిల్లా వుండేదే కాదు." అని బావురుమని ఏడ్చేసింది.

సరోజిని ఖంగారు పడింది.

"సరోజినీ! నేను ఏడుపు ఆపుకోలేను. అందుచేతనే ఈ ప్రస్తావన ఎవ్వరూ చేయడానికి అవకాశం యివ్వను. ఎంతసేపో ఏడిస్తేనేకాని నా మనస్సు కుదుటపడదు. ఇతరులముందు ఏడిస్తే, మొగుడు కావాలని ఏడుస్తోందంటారు. చులకనయిపోతాను."

సరోజిని కన్నీళ్లు తుడిచింది. సురేఖ కొనసాగించింది.

"మా నాన్నగారు తన నోటితో నన్ను కాపురానికి పంపనని ఎప్పుడూ చెప్పలేదు. వారికి పంపాలనే అభిప్రాయమూ లేదు. మావారే నాయందు అనురాగంచేత మా ఇంటికి వచ్చేవారు — అంటే వారి అత్తింటికి!

మా అన్నదమ్ములు ఇంగ్లీషు చదువుకు అలవాటుపడ్డవాళ్లు. క్రాపింగు పెట్టుకోవడం, అన్నంముందు కూడా ఇంగ్లీషే మాట్లాడుకోవడం గొప్ప అని అనుకునేవాళ్లు. సంధ్యావందనం చెయ్యాలనే పట్టుదల లేనివాళ్ళు.

మావారు గోష్పదం అంత జుట్టు పెట్టుకొని, విభూతిరేఖలు తీర్చి, చక్కగా సంధ్యావందనం చేసుకునేవారు అత్తింట్లోకూడా. మా యింట్లో ఆ పిలక పెట్టుకోవడాన్ని ఆక్షేపించి, వారిని పల్లెటూరి బైతు అని పిలచేవారు. మావారు దానిని బావమఱదుల వేళాకోళం క్రింద సరిపెట్టుకునేవారు. వాళ్ళు తేలికగా చూసినా, పోనీలే! అని దులుపుకుపోయేవారు. ఒకరోజున మావారి ఓర్పుకు పరీక్ష వచ్చింది. వారు నిద్రపోతుంటే వారి పిలకను మా అన్నదమ్ములు కత్తిరించారు. మా నాన్న కొడుకులు చేసిన ఘనకార్యానికి సంతోషించాడు. వారు నిద్రలేచి జరిగిన పనికి బాధపడ్డారు. అంతే! మళ్ళీ ఆ యింట్లో అమృతమన్నా అని అనలేదు. స్వగ్రామం వెళ్ళిపోయారు."

"ఎంత పని జరిగిపోయింది!"

"బ్రిటిష్‌వారు యీ దేశానికి రాకముందు మనలో మగవారికి క్రాపింగు లున్నవా? క్రాపింగులు విదేశీయుల అనుసరణం కాదా! పర నాగరకతమీద వ్యామోహపడేవారూ, జాతీయమైన జుట్టు పెట్టుకునేవాళ్ళను ఆక్షేపించడం న్యాయమా?"

"కాదు."

"రోజూ శిరస్స్నానం చేయవలసినవాళ్ళకి పిలకజుట్టు సరిపడినట్లు క్రాపింగు సరిపడుతుందా?"

"సరిపడదు."

"అసలు యీ ముందు చూరులవల్ల ముఖం మూసుకుపోతుంది. ఇవి లేకుండావుంటే ఎవరి నుదురు ఎంత విశాలమో స్పష్టంగా తెలుస్తుంది."

"నిజం."

"ఆ నుదుటిమీద చక్కగా మూడు రేఖలతో భస్మధారణం చేసేవారు, వెనకటివాళ్ళు. ఇప్పుడూ కొందఱు చేస్తున్నారు. గోడకు వెల్ల వేసినట్లు ఇప్పుడు ఆడా మగా, ఫేసుపౌడర్లు కొట్టుకుంటే లేని ఆక్షేపణ విభూతికి ఎందుకు వుండాలి? విభూతిరేఖల మధ్య ప్రదేశంలో రూలు గీసినట్లుగా అడ్డంగా గంధం పెట్టేవారు. అంటే వెనుక తెలుపు బాంక్ గ్రౌండ్. మధ్యలో పసుపచ్చని గంధపు గీఱ. దానిమీద అక్షతలు పెట్టేవారు."

"మా నాన్నగారు విభూతి, గంధం పెట్టి, కుంకుమ పెడతారు. మరి అక్షింతలు ఏమిటి?"

"మీ నాన్నగారు బహుశః పసుపు కుంకుమ పెట్టుకుని వుంటారు. పసుపు కుంకుమ అంటే, పసుపుకొమ్ములతో తయారుచేసిన కుంకుమ. కాబట్టి ముఖంవంక చూస్తే తెలుపు, పసుపు, ఎఱుపు రంగులతో త్రివర్ణశోభితమై వుంటుంది. అక్షతలంటే, తోటకూరకాడకాని, అరటిపూవుకాడకాని మాడ్చి, దాని పొడిలో పసుపు కలిపి కణికల క్రింద తయారుచేసి నిల్వ వుంచుకుంటారు. వాటిని అరగతీసి గంధం పెట్టుకున్న తర్వాత కుంకుమకు బదులుగా పెట్టుకుంటారు.

మూడవ నేత్రం, అగ్ని నేత్రమనీ, జ్ఞాన నేత్రమనీ అంటారు. ఆ నేత్రం వుండే స్థానాన్ని తిలకంతో అలంకరిస్తారు. చల్లదనం కోసం ఫాల ప్రదేశాన్ని చందనమయం చేస్తారు."

"ఆదా, సంగతి!"

"వ్యక్తి స్వాతంత్ర్యం కావాలనీ, భావ స్వాతంత్ర్యం కావాలనీ, అనేవాళ్లకు దానిమీద ఎంతవరకు విశ్వాసం వున్నదీ అనే సంగతి ఆలోచించాలి. గుండు చేయించుకుని, గడ్డం పెంచుకునే వాళ్ల విశ్వాసాన్ని గౌరవిస్తాంకాని, పిలక పెట్టుకునే వాళ్లను మాత్రం వేళాకోళం చేస్తాం. మన తాతలూ, ముత్తాతలు పిలకలే పెట్టుకున్నవారన్న సంగతి మనం క్షణంలో మరచిపోతాం."

"నిజం!"

"నాన్న అన్నా, అన్నలన్నా, నాకు గౌరవం, అభిమానం, భయం వుండేది. వారు చేసినది తప్పని తెలిసినా నేను ఎదిరించలేకపోయాను. నేను తప్పురా! అని అంటే, అల్లా చేస్తేనేకాని మీ ఆయన మూఢాచారం వదలి క్రాపింగు పెట్టుకుని ఇంగ్లీషు చదువుకోడని అనేవాళ్లు మా అన్నలు!"

"క్రాపింగు పెట్టుకోవడం మూఢాచారమో, పిలక పెట్టుకోడం మూఢాచారమో తేల్చగలవాళ్లెవరు?"

(34 వ పేజీ చూడండి)

## ఆశకు హద్దులు

*బి. రామలింగరాజు*

ఆశల ఆకాశమంతా
ఎగరాలనే ఆలోచన మాను
ఆశకు హద్దులు గియ్యి
దానికే రంగులు వెయ్యి.

దగ్గర వస్తువులు తప్ప
దూరానివి కనబడని నువ్వు
మసక జోడెట్టుకున్నావు;
మీసాలు మెలేసేవాళ్లు తప్ప
చిక్కిన పొట్ట ఆనని నువ్వు
మనసెందుకు మార్చుకోవు.

భూమి ఒకసారి తిరిగితే
మూడుసార్లు తినాలి నువ్వు
ఒకసారి నోచుకోనివాళ్ల
భూమి నంటిపెట్టుకొనే వున్నారు.
అది చూచి భూమి ఆగిపోలేదు
ఆగవలసిందదికాదు అసలైనదైతే నీ గుండె

ప్రపంచంలో కార్లు వున్నాయి
అందుల్లోనే గుడిసెలూ వున్నాయి
గుడిసెలన్నీ ఒక వస్తువును చేసాయి
కార్లపై మెరుగులయ్యాయి
వస్తువు రూపాన్ని మార్చాయి
వస్తువంతా ఆ మెరుగే అనుకొంటే
అందుల్లో ఇంకేమీ లేదనుకుంటే

అలాగే ముందుకు వెళ్లు
నువ్వలాగే ముందుకు వెళ్లు.
తల పైకెత్తేసి
చుక్కలు దాటి చూసి
అయ్య బాబోయ్! నేను
అక్కడెప్పుడన్నావు?
తల కిందకు దించి
పాతాళానికి చూసి
అయ్యో పాపం వాళ్లు
అక్కడున్నారనవు?

ఆశల ఆకాశమంతా
ఎగరాలనే ఆలోచన మాను
ఆశకు హద్దులు గియ్యి
దానికే రంగులు వెయ్యి.

# * సినిమా సంక్రాంతి *



## "భోగి పండుగ రోజున టపాకాయలు కాలుస్తా"

"భోగి, సంక్రాంతి, కనుమ [illegible] ఈ మూడు పండుగలంటే నాకెంతో [illegible]. ఆ పండుగ లొస్తున్నాయంటే చాలు, నా మనస్సు మధుర భావాలతో పురకలేస్తుంది. ఏదో క్రొత్త వుత్సాహం, హుషారులతో పొంగిపోతుంది.

నేను చదువుకునే రోజుల్లో, సంక్రాంతి రోజున నా క్లోజ్ ఫ్రండ్స్‌తో కల్సి పిక్‌నిక్‌కు వెళ్లి, కమ్మని కబుర్లతో, కాలక్షేపం చేసేదాన్ని. తార నయ్యాక అలాంటి పిక్‌నిక్‌లు కరువయ్యాయనే బాధ లేకుండా, తోటి తారలతో కల్సి ఆరోజు కూడా షూటింగ్‌లో పాల్గొంటూ, సంక్రాంతి రోజున రెట్టింపు సంతోషాన్ని అనుభవిస్తుంటాను. సంక్రాంతిని రెండువిధాలుగా చేయడం నా అలవాటు. ఆరోజు తెలుగు చిత్రం షూటింగ్‌లో వుంటే తెలుగువారి పద్ధతి ప్రకారం, తమిళ చిత్రం షూటింగ్‌లో వుంటే వాళ్ళ పద్ధతి ప్రకారం సంక్రాంతిని సెలబ్రేట్ చేస్తుంటాను.

భోగి పండుగను అందరికిమల్లే కాకుండా, ఆరోజు కూడా దీపావళిరోజు లాగే టపాకాయలు కాలుస్తుంటాను. నా చిన్ని తమ్ముడికి భోగిపళ్ళు పోస్తుంటాము.

గత సంక్రాంతి సందర్భంలోనే "తెలుగు చిత్రాల్లో నటించడానికి నేను పనికొస్తాను" అంటూ మీరందరూ నన్ను ఆశీర్వదించారు. మీ ఆశీర్వాద బలం, నిర్మాతల సహృదయం, పత్రికేయుల సహకారంతో యీ సంక్రాంతికి మరిన్ని తెలుగు చిత్రాల్లో నటించే భాగ్యానికి నోచుకున్నాను. ఈ సంక్రాంతికి కూడా నన్ను మనసారా దీవించి, రాబోవు సంక్రాంతినాటికి యింకా ఎక్కువ చిత్రాల్లో నన్ను నటింపచేస్తారని విశ్వసిస్తూ, ప్రేక్షకులకు, పరిశ్రమవారికు, పత్రికేయులకు నా మనఃపూర్వక శుభాకాంక్ష లందజేస్తున్నాను."

**- జయచిత్ర**

### ఆమె వితరణ!

స్వర్గీయ ఆదుర్తిగారి కుటుంబంపట్ల కృష్ణ, విజయనిర్మలగార్లకు ఆదినుంచి కృతజ్ఞతాభావం వుంది. ఆయన మరణానంతరం, వారి అబ్బాయి ఆదుర్తి భాస్కర్ ఒక చిత్రాన్ని నిర్మించదలచి, విజయనిర్మలగారిని దర్శకత్వం చేసిపెట్టమని అడిగారు.

ఆమె వెంటనే అంగీకరించింది. (కమర్షియల్‌గా ఆలోచించక.)

ఆదుర్తి ఆర్ట్స్ పేరిట అంతా అవుట్‌డోర్‌లో నిర్మితమయ్యే కలర్ చిత్రానికి డిశంబర్ పదహారున రికార్డింగ్ ముహూర్తం జరిగింది.

ఆచార్య ఆత్రేయ వ్రాసిన పాటను, సుశీల పాడింది. మహదేవన్ సంగీత దర్శకుడు.

హీరో కృష్ణ కథానాయకుడుగా, విజయనిర్మల కథానాయికగా నటిస్తున్న ఆదుర్తి ఆర్ట్స్ వారి వర్ణ చిత్రానికి బాలమురుగన్ కథను, సత్యానంద్ రచన్ను, పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

ఈ వర్ణ చిత్రంలోని సహాయ పాత్రలను నాగభూషణం, కాంతారావు, చంద్రమోహన్, మమత పోషించగలరని, మరికొన్ని పాత్రలను ప్రముఖులు ధరించగలరని, నిర్మాణ నిర్వాహకుడు ప్రసాద్ చెప్పారు.

కృష్ణానదీతీరాన కొంత, మానికొండ దగ్గర మరికొంత యీ చిత్రం తాలుకు షూటింగు జరుగుతుంది.



'పూదమ్మడి బ్రతుకులు'లో మాధవి, సత్యేంద్రకుమార్



# జయసుధ "కృతజ్ఞత"

స్వయం ప్రతిభతో రాణించేవాళ్ళు ఎక్కువకాలం మనగలరు. అలా పైకొచ్చేవాళ్ళు, తమ స్థానాన్ని పటిష్టం చేసుకునే ప్రయత్నంలో తప్పటడుగులు వెయ్యరు. తమ ప్రగతికి కారణంగా కనపడేవారికి "కృతజ్ఞత" అర్పించక మానరు. తారాపథంలో ప్రముఖ స్థానాన్ని కృషితో సంపాదించుకున్న జయసుధ సంక్రాంతి కొక "కానుక" యిచ్చింది. అదేమిటో చదవండి:

### సంక్రాంతి కానుక—కృతజ్ఞత

"లక్షలాది ప్రేక్షకులకు "సంక్రాంతి" కానుకగా నేను యివ్వగలిగింది ఒక్కటే. "కృతజ్ఞత ... కృతజ్ఞత ... కృతజ్ఞత."

"ఎందుకంటే గత సంవత్సరం 'సంక్రాంతి' నాడు, నేను యింత పాపులర్ స్టార్‌ను కాను. ప్రేక్షకులు చూపిస్తున్న ప్రేమాభిమానాలవల్లే నేడు నేను "బిజీ స్టార్" నయ్యాను.

"నాకు వచ్చే ఉత్తరాలు, నన్ను ఎంత ఆత్మీయురాలుగా ప్రజలు పరిగణిస్తున్నారో తెలుపుతున్నాయి. రోజుకు సగటున యిరవై అయిదు ఉత్తరాలు నాకు వస్తాయి.

"నన్ను అభిమానించేవారిలో విద్యార్థులు, ఉన్నత పదవులను నిర్వహిస్తున్నవారు ఎక్కువశాతం గావడం నాకు మరింత ఆనందాన్ని యిస్తోంది."

### తప్పు ... ఒప్పు

"అభిమానించేవాళ్ళు, మంచితోబాటు తప్పులనుకూడా చెప్పినప్పుడే, ఆరాధన అవుతుంది. నా అభిమానులందరూ నా నటనలోని తప్పులను కూడా పాయింట్‌అవుట్ చెయ్యడం నాకెంతో ఉపకరిస్తోంది.

"జ్యోతి" వంటి క్లాసికల్ పాత్రలను ఏడాదికొకటి మాత్రం వెయ్యమని కోరుతున్న నా అభిమానులకు "సంక్రాంతి" దినాన "అలాగే" అని హామీ యిస్తున్నాను.

"నేను నటిగా ఎంత దశను అందుకున్నా, దాని వెనక ఎందరో కృషి చేసేవాళ్ళు వుంటారన్న నిజాన్ని నిర్భయంగా ఒప్పుకుంటాను.

"నన్ను మరొక హీరోయిన్ వున్న చిత్రంలో చూడడానికి యిష్టపడమని ఫీలయ్యే అభిమానులకు ఒక నిజాన్ని చెప్పదలచాను."

### సమాన బలం

"సమానబలం వున్న పాత్ర అయినప్పుడు, నాకంటే సీనియర్ ఆర్టిస్టు పని చేస్తున్నప్పుడు, అలాంటి పాత్ర నంగీకరించడం తప్పు కాదని ఫీలవుతాను.

"ఫలానా హీరోతోనే చెయ్యాలని నేను ఎప్పుడూ ఎక్కడా అనలేదు. అనముకూడా.

"ఒక చిత్ర విజయానికి కథ, దర్శకుడు ముఖ్యాలని నా అభిప్రాయం.

"కొన్ని చిత్రాలలో నేను ధరిస్తున్న పాత్రలను ప్రేక్షకులు అపార్థం చేసుకోవచ్చు. కొందరికి "వాల్గరైజ్" చెయ్యక తప్పదు."

### పద్మప్రియ చేసిందేమిటి ?

ఇప్పుడిప్పుడే పైకొస్తున్న పద్మప్రియకు దాసరి ఒక అపూర్వమైన పాత్రను యిస్తే, ఆమె అన్యాయంగా ఆ అవకాశాన్ని పోగొట్టుకుంది.

సావిత్రి గాని, వాణిశ్రీ గాని చెయ్యదగిన వేషాన్ని, పద్మప్రియకు దాసరి యిస్తే, దానిని లక్ష్యపెట్టక రేపు షూటింగు అంటే, యివాళ రాలేను అని చెప్పడం ఆమెలాంటి వర్ధమాన నటికి మంచిదికాదు.

ఇకపై పద్మప్రియను ఎవరు నమ్మగలరు ? ఆమెకు మంచి పాత్రను ఎవరు యివ్వగలరు ?

### "సామ్రాట్" విదేశ పర్యటన

ఆంధ్రుల అగ్రనటుడు, "ఎవర్‌గ్రీన్" నటుడు, మృత్యువును జయించిన మానవోత్తముడు ఎవరు? ఆయన కొత్త సంవత్సరం అయిదో మాసంలో విదేశాలకి వెళ్తారు.

"అమెరికా... ఇంగ్లండ్" మున్నగు దేశాలలో నెల రోజులు పర్యటించి వస్తారు.

పర్యటన సందర్భంలో, ఆయన తన స్టుడియోకు వలసిన మోడరన్ టెక్నిక్‌ను గూర్చి పరిశీలన చేస్తారు.

ప్రతి సంవత్సరం "మే"లో అక్కినేని రెస్టు తీసుకుంటారు అన్న నిజం అందరికీ తెలుసు. ఈసారి విదేశంలో "రెస్టు" ప్లేసుని ఎంపిక చేశారు.

అమెరికాలో అక్కినేనిగారి అబ్బాయి, అమ్మాయి... అల్లుడు వున్నారుకూడా.



'కురుక్షేత్రం'లో కర్ణుడుగా కృష్ణంరాజు

### పసిదానినే

"ఈ పర్వదినాన ఒకటిమాత్రం ప్రామిస్ చెయ్యగలను. నేను ఎంత పెరిగినా ... పెద్దల దృష్టిలో, ప్రేక్షకుల దృష్టిలో పసిదాన్నిగా వుండిపోతాను.

"ప్రస్తుతం నేను నటించే చిత్రాలలో నచ్చినవి ఏవి అని అభిమానులు అడుగుతున్నారు. అన్నపూర్ణా పిక్చర్స్ వారి "ప్రేమలేఖలు" ద్వారకా ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి చిత్రం. సత్య చిత్ర వారి సినిమాస్కోప్ చిత్రం."

### బిగ్ ఫోర్‌తో చిత్రాలు

"కొత్త సంవత్సరంలో శ్రీ రామారావుగారితో ఒక చిత్రంలో, శ్రీ నాగేశ్వరరావుగారితో ఒక చిత్రంలో, శ్రీ శోభన్‌బాబుగారితో ఒక చిత్రంలో నటిస్తున్నాను.

శ్రీ కృష్ణగారితో నటించగలనన్న నమ్మకం నాకు లేకపోలేదు. ఆ కోరికను యీ కొత్త సంవత్సరం తీర్చకపోతుందా!" అంటూంది జయసుధ.

### విక్టరీ చిత్రాల రికార్డింగు

విక్టరీ మధుసూదనరావుగారి రెండు కొత్త చిత్రాల రికార్డింగులు డిశంబర్ నెలలో జరిగాయి.

సుగుణ పిక్చర్స్ వారి వర్ణ చిత్రం తాలుకు పాట రికార్డింగు డిశంబర్ 17 న ప్రసాద్‌లో జరిగింది. ఆచార్య ఆత్రేయ వ్రాసిన పాటను, బాలు ... సుశీల ఆలాపించారు. మహదేవన్ సంగీత దర్శకుడు. ఎమ్. శేషగిరిరావు నిర్మాత.

సమత ఆర్ట్స్ వారి వర్ణ చిత్రం తాలుకు పాట రికార్డింగు డిశంబర్ 20 న, జెమినీలో జరిగింది. ఆరుద్ర రచయిత. ఎస్. పి. బాలసుబ్రమణ్యం పాడారు. చటర్జీ నిర్మాత.

సుగుణ పిక్చర్స్‌కు అక్కినేని కథానాయకుడు. సమత ఆర్ట్స్‌కు శోభన్‌బాబు నాయకుడు.

మొదటి చిత్రం అన్నపూర్ణ స్టుడియోలో ఫిబ్రవరి రెండున ప్రారంభం. రెండో చిత్రం వాహినీలో జనవరి ఒకటిన ప్రారంభమైంది.



'ఆలుమగలు'లో అక్కినేని



### "అత్తవారిల్లు"కు అడిషనల్ వేల్యూ

ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ నిర్మించిన "అత్తవారిల్లు" చిత్రం, "ఇల్లరికం... భార్యా భర్తలు" చిత్రాల విజయాన్ని చవిచూచే అర్హతను బడసియుంది. ప్రయోగాత్మక దర్శకుడు ప్రత్యగాత్మ "అత్తవారిల్లు" చిత్రాన్ని ప్రయోజనం గలదిగా రూపొందించారు.

"అత్తవారిల్లు" చిత్రానికి "రాజబాబు, రమాప్రభ" పాల్గొన్న బుర్రకథ ట్రయిలర్ అడిషనల్ వేల్యూ నివ్వగలదు. ఆదర్శవంతమైన చిత్రాలను అందించే అనుమోలు సుబ్బారావుగారికి "అత్తవారిల్లు" చిత్రం ఆధిక్యతను ఆర్జించి పెట్టగలదు.

ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ స్థాపించిన లగాయితు, నేటివరకు ఒక సంప్రదాయం ఆచరణలో వుంటూ వుంది. పి. ఏ. పి. నిర్మించిన మొదటి చిత్రం "పెంపుడు కొడుకు". ఆ చిత్రానికి ఎల్. వి. ప్రసాద్‌గారు దర్శకుడు. తర్వాత చిత్రం "ఇల్లరికం". దానిని ప్రసాద్‌గారి శిష్యుడు తాతినేని ప్రకాశరావు డైరెక్ట్ చేశారు.

ఆ సంస్థ నిర్మించిన మూడవ చిత్రం "భార్యా భర్తలు". తాతినేని ప్రకాశరావుగారి శిష్యుడు ప్రత్యగాత్మ డైరెక్ట్ చేశారు. ప్రత్యగాత్మగారి దర్శకత్వంలో "కులగోత్రాలు, పునర్జన్మ" వచ్చాయి. తర్వాతి చిత్రాలను ప్రత్యగాత్మగారి శిష్యుడు తాతినేని రామారావు డైరెక్ట్ చేశారు.

ఇలా పి. ఏ. పి. చిత్రాలన్నిటినీ, గురు శిష్యులే డైరెక్ట్ చెయ్యడం గమనించదగ్గ విషయం. అలాగే యిరవై అయిదు సంవత్సరాల నుంచి వస్తున్న పి. ఏ. పి. చిత్రాలన్నీ నవయుగ విడుదల చెయ్యడం ముదావహం.

# సినిమా

### మార్పు మంచి మాటేంగు !

"అత్తవారిల్లు" చిత్రానికి ప్రత్యగాత్మకు ఫస్ట్ అసిస్టెంటుగా పని చేసిన ఏ. ఎస్. గాంధీని, నిర్మాత సుబ్బారావుగారు దర్శకుడుగా ఎంపిక చేశారు.

రాబోయే మార్పు మంచి మాటేంగు వుండ గలదని, కథను దర్శకుడు గాంధీ వ్రాశారని, ఆ చిత్రంలో కొత్త నటీనటులు వుండగలరని, పి. ఏ. పి. అధినేత చెప్పారు.

అక్కినేని, వాణిశ్రీ నటిస్తున్న "ఆలుమగలు" వర్ణ చిత్రం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి జూబ్లీ యియర్ చిత్రం అవుతుంది. తాతినేని రామారావు దర్శకుడు.

పి. ఏ. పి. వారి "ఆలుమగలు" వర్ణ చిత్రానికి సంబంధించిన అయిదు పాటలను యీ విలేఖరి విన్నాడు. ఆ పాటలను డాక్టర్ నారాయణరెడ్డి, వేటూరి సుందరరామ్మూర్తి, శ్రీశ్రీగార్లు వ్రాశారు. ఎస్. పి. బాలసుబ్రమణ్యం, సుశీల, రామకృష్ణ, రమేష్, విజయలక్ష్మిశర్మగార్లు పాడారు.

అయిదింటిలో బాగున్న పాటలు ఎన్ని అని ప్రశ్నిస్తే? "అన్నీను" అని నిరభ్యంతరంగా చెప్ప గలదు యీ కలం. అన్ని తరగతులవారిని ఆకర్షించే అయిదు రకాల పాటలను, చలపతిరావుగారు ట్యూన్ చేశారు.

"ఆలుమగలు" చిత్రంలో చలపతిరావుగారి కృషిని ప్రేక్షకులు అభినందించగలరు.

చలపతిరావుగారు సంగీతం సమకూర్చే ఏ చిత్రాన్నయినా పరిశీలించండి. ప్రతి చిత్రంలో కనీసం



'ఉత్తమురాలు'లో విజయలలిత

రెండు పాటలయినా హిట్ అవుతూవున్న నిజాన్ని ఎవ్వరూ కాదనలేరు. తెలుగు చలన చిత్ర రంగానికి చలపతిరావుగారు అత్యవసరమయిన ప్రతిభావంతుడు.

### మురళీ చిత్రలు - మూడు చిత్రాలు

మురళీమోహన్... జయచిత్రలు మూడు చిత్రాలలో ముఖ్య జంటగా నటిస్తున్నారు. ఈ జంట నిజంగా "నాచురల్ కపుల్" వలె కనిపిస్తారు.

నిర్మాత క్రాంతికుమార్‌గారి "కల్పన" ఒకటి. నిర్మాత మహేంద్రగారి "ప్రేమించి పెళ్ళి చేసుకో" మరొకటి. నిర్మాత ఎస్. గోపాలకృష్ణారెడ్డిగారి "తాళిరేయి గడిచింది" యింకొకటి.

"కల్పన" చిత్రానికి రాఘవేంద్రరావు దర్శకుడు. "ప్రేమించి పెళ్లి చేసుకో" చిత్రానికి హేమాంబరధరరావు దర్శకుడు. "తాళి రేయి గడిచింది" చిత్రానికి రామిరెడ్డి దర్శకుడు. [ముగ్గురు దర్శకుల యింటి పేర్లు "కొ"తో ఆరంభమవుతాయి.]

మురళీ చిత్రలు కలిసి నటిస్తున్న పై మూడు చిత్రాలు వేర్వేరు కథలను గొనియుండడంవల్ల, పాత్రల స్వభావాల్లో ఎంతో తారతమ్యం వుండడం వల్ల, ప్రేక్షకులు "బోర్" ఫీలయ్యే అవకాశం వుండదు.

"అక్కినేని... వాణిశ్రీ"గార్లవలె "మురళీ... చిత్ర" లకు ప్రేక్షక ఆమోదం లభించవచ్చు.

### ప్రభ గీత

చిత్ర చిత్ర ప్రవర్ధమాన మవుతున్న నటిగా ప్రభను పేర్కొనవచ్చు. ప్రస్తుతం ప్రభ వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నది. ఆమెవలె వెరైటీ వేషాలను "యంగ్ బ్యాచ్"లో మరెవ్వరూ పోషించడం లేదుకూడా.

శ్రీ లక్ష్మి నరసింహా కంబైన్స్ నిర్మిస్తున్న "గీత... సంగీత" చిత్రంలో ప్రభ నటన అద్భుతంగా వుంది. ముఖ్యంగా పతాక సన్నివేశంలో ప్రభ అద్వితీయంగా నటించింది.

శోక పాత్రలకు ప్రభ ఎంత న్యాయం చెయ్య గలదో, గ్లామర్ వేషాలకు కూడా ఆమె అంతే న్యాయం చెయ్యగలదు అని "గీత... సంగీత" చిత్రం నిరూపిస్తుంది.

కొత్త దర్శకుడు కోటారెడ్డికి, నిర్మాతలు మావుళ్ళయ్య, చింతా బ్రాహ్మణరెడ్డి, వాగంటి బాపయ్యగార్లకు ప్రభ పత్రికాముఖంగా థ్యాంక్స్ చెప్పుకుంటూంది. (బలే వేషం యిచ్చినందుకు)

'చక్రధారి'లో ఒక దృశ్యం

### కన్య–శ్రీవిద్య, కుమారి - జయమాలిని

దాసరి రూపొందిస్తున్న మరొక సంచలన చిత్రం ''కన్య ... కుమారి'' డిశంబర్ 16 న ప్రారంభమై, పక్షంరోజులు జరిగింది.

కథలో కొత్తదనం సృష్టించడంలో దాసరికి నన్ను మార్కు లివ్వాలి.

కన్యగా శ్రీవిద్య, కుమారిగా జయమాలిని నటించ, ఆ యిద్దరినీ అధికరించే యువకుడుగా నరసింహరాజు నటిస్తున్నారు.

ఈ కలర్ చిత్రాన్ని టి. కాశీ, డి. నారాయణరావు గార్లు నిర్మిస్తున్నారు. సాంబశివరావు నిర్వాహకుడు. ప్రముఖ గాయకుడు బాలు సంగీత సారధ్యం వహించడం యీ చిత్రంలోని విశేషాంశం.

### నిర్మల విజయమ్

దర్శక శాఖలో ''ఎ''వన్ అని నిరూపించుకున్న విజయనిర్మలగారికి, దేవుడే గెలిచాడు చిత్రం మరింత పేరుతెచ్చి పెట్టింది.

నవంబర్‌లో విడుదలైన ''దేవుడే గెలిచాడు'' వర్ణచిత్రాన్ని, అన్ని తరగతులవారు ''బాగుంది.. బాగుంది'' అని మెచ్చుకున్నారు. దర్శకత్వం గూర్చి అందరివీ ప్రశంసలే.

నిర్మలగారు సాధిస్తున్న ఈ విజయము, స్వయం ప్రతిభతో ఆర్జించినదే అన్నది జగమెరిగిన నిజం.

ఇప్పుడామె మూడు చిత్రాలకు దర్శక భారం వహించడానికి వొప్పుకుంది. స్వర్గీయ ఆదుర్తిగారి

## సినిమా

కోసం ఒక చిత్రం. తన దగ్గర రూపశిల్పిగా పని చేస్తున్న మాధవరావు కోసం ఒక చిత్రం. గోటేటి భాస్కరరావు కోసం ఒక చిత్రం.

ప్రజలు మెచ్చే చిత్రాలను అందిస్తున్న విజయ నిర్మలను ''ప్రజా దర్శకురాలు'' అని ఈ కలం వ్రాయడానికి సంశయం దేనికి ?

### గీత... సంగీత !

''స్వర్గం ... నరకం'' వంటి విశిష్టమైన చిత్రాన్ని అందించిన శ్రీ లక్ష్మీనరసింహా కంబైన్స్ అధినేతలు (మావూళ్ళయ్య...రామతారకం భాస్కర రావు) మరొక వుత్తమ జాతి చిత్రాన్ని అందివ్వ బోతున్నారు.

చిత్రంపేరు ''గీత...సంగీత'' మకుటాన్ని బట్టి, ఇదొక మహిళా చిత్రం అని పాఠకులు అర్థం చేసుకోగలరు.

ఈ చిత్రంలో ప్రభకు నవరస భరితమైన పాత్ర లభించడం ఎంతో అదృష్టమో, ఆ పాత్ర పట్ల ఆమె చూపుతున్న శ్రద్ధాసక్తులు అంత విజయాన్ని తెచ్చిపెట్టగలదు.

నటిగా ప్రభ జాతకమే అదృష్టమయం అయ్యేది తథ్యము అని ''గీత...సంగీత'' నిరూపి స్తుంది.

ఈ చిత్రాన్ని కొత్త దర్శకుడు కోటారెడ్డి బహుజన రంజకంగా రూపొందిస్తున్నాడు. ఈ చిత్రంలో కృష్ణంరాజు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, కాంతారావు, అంజలీదేవి, శుభ, రమాప్రభ, అల్లు రామలింగయ్య వంటి విఖ్యాత నటులు వున్నారు,

### కృష్ణకు మరొక హిట్

1976 లో కృష్ణ నటించిన ''కొల్లేటి కాపురం, భలేదొంగలు ... దేవుడేగెలిచాడు'' చిత్రాలు విజయాన్ని సాధించాయి. ప్రజల్లో కృష్ణగారి యిమేజ్ విపరీతంగా పెరిగింది.

1977 లో కూడా కృష్ణగారికి హిట్ చిత్రాలు ఎన్నో వస్తాయి. విజయా... సురేష్‌వారి ''సావాసగాళ్ళు'' వర్ణచిత్రం కృష్ణగారికి శతదినోత్సవ చిత్రం కాగలదు.

నిర్మాత రామానాయుడుగారి సెలక్షన్ అలాంటిది. ఆయన ఎన్నుకున్న ''సావాసగాళ్ళు'' చిత్రానికి కృష్ణ సరయిన నాయకుడు అనేది నిజాన్ని ప్రేక్షకులు అంగీకరించగలరు.

''సావాసగాళ్ళు'' చిత్రం దర్శకుడు బోయిన సుబ్బారావుకు, సంగీత దర్శకుడు రాఘవులకు, నటుడు గిరిబాబుకు పెద్దమలుపును తెచ్చి పెడుతుంది.

ఈ చిత్రంలో గుమ్మడి, సత్యనారాయణ, నాగేష్, ప్రభ, రమాప్రభ సహాయ పాత్రలను పోషిస్తున్నారు. ''జయచిత్ర''కు జయాన్ని ఇచ్చే చిత్రం ''సావాసగాళ్ళు.''



# అందాల అన్నపూర్ణ!

ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో ''అందాల అన్నపూర్ణ'' వెలసి యీ సంక్రాంతికి ఒక సంవత్సరం అవుతూంది.

మానవుడు ఆశాజీవి. ఆశ ఎంత అవసరమో, అది నెరవేరడానికి పడే కష్టం చెప్పనలవికానిది. కృషిని నమ్మిన వ్యక్తి మన అక్కినేని. ఆయన నమ్మకమే శ్రీరామ రక్షగా వుంటూ, అనూహ్యమైన పనులను సునాయాసంగా చేయిస్తుంది.

అక్కినేనిగాక మరొకరయితే, అనుకున్న అర్ధ గంటకల్లా స్టుడియో స్కెచ్ గీయించి, మూడు మాసాలలో స్టుడియోను నిర్మించి వుండగలరా?

### పట్టు విడవని శ్రమజీవి

పట్టుదల, క్రమబద్ధమైన కార్యదీక్ష అక్కినేనికి తోబుట్టువులు గావడంచేత 'అన్నపూర్ణ' అనెడి అందాల స్టుడియో ఆవిర్భవించింది.

''అన్నపూర్ణ'' స్టుడియోస్‌లో యీ పండుగ నాటికి మూడు ఫ్లోర్లు వుంటాయి. అక్కినేని చిత్రాలకు మాత్రమేగాక, యితరులు కూడా నిర్మాణం చెయ్యడానికని, మరో ఫ్లోర్ కూడా రంగంలోకి రాబోతూంది.

డబ్బింగు, ప్రివ్యూ థియేటర్ కూడా సంక్రాంతికి రెడీ అవుతాయి అనగానే, నిర్మాతలు మరింత సంతోషాన్ని అనుభవించగలరు.

### భూతల స్వర్గము!

రాత్రి ఏడు గంటలప్పుడు ''అన్నపూర్ణ'' స్టుడియోస్ నుంచి కనిపించే ''వ్యూ'' భూతల స్వర్గమా అనెడి భావాన్ని కలిగిస్తుంది.

హిందీ చిత్ర నిర్మాతలు యీ లొకేషన్ బ్యూటీని చూశారో, వాళ్ళ ''అన్నపూర్ణ స్టుడియోస్''ను వదలి వెళ్ళలేరు.



నాగేశ్వరరావు ఏది చేసినా, దూరదృష్టితోనే ఆచరిస్తారనడానికి యీ స్టుడియో నిర్మాణం ఒక చక్కటి నిదర్శనం.

### ఏడు చిత్రాల నిర్మాణం

గత ''సంక్రాంతి''కి ''సెక్రటరీ'' చిత్రంతో ప్రారంభమైన అక్కినేని స్టుడియో వరుసగా ''మహాత్ముడు, జడ్జిగారి కోడలు, చక్రధారి, ఆలుమగలు, బంగారు బొమ్మలు, దాన... వీర... శూర... కర్ణ'' చిత్రాల నిర్మాణానికి వుపయోగపడింది.

అన్నపూర్ణా స్టుడియోస్‌లో వున్న ''శెకెన్స్ కెమెరా'' భారతదేశంలో మరెక్కడా లేదుకూడా''

స్టుడియోను ''పవిత్ర దేవాలయం''గా పూజిస్తున్న అక్కినేని, దానిని ''సుందర బృందావనం''గా కూడా రూపొందిస్తున్నారు.

### విదేశీయుని కామెంట్

ఇటీవల ఒక విదేశీయుడు ''అన్నపూర్ణ స్టుడియోస్''ను తిలకించి యిలా అన్నాడు:

''ఇట్ యీజ్ సింప్లీ సుపర్బ్. నాచురల్ అవుట్‌లుక్ యీజ్ ది యస్సెట్ ఆఫ్ ది స్టుడియో''.

తను సినిమాల్లో వున్నా, నిష్క్రమించినా, ''అన్నపూర్ణ స్టుడియోస్'' మాత్రం దేదీప్యమానంగా వెలుగొందుతుంది.

తెలుగు చలన చిత్ర చరిత్రలో అక్కినేని నిర్మించిన స్టుడియోకు ప్రత్యేకమైన పొజిషన్ శాశ్వతంగా వుండిపోతుంది.

ఆసియాలో ''అన్నపూర్ణ''కు అద్వితీయమైన స్థానం వచ్చేందుకు అక్కినేని వంటి మేధావి ఒక్కరు చాలు.

### సింగీతం సీజన్

''ఒక దీపం వెలిగింది'' చిత్రం గాలి వానను కూడా ఎదిరించి నిలబడగలిగితే, ''అమెరికా అమ్మాయి'' అన్ని చిత్రాలను సునాయాసంగా ఓడించగలిగింది.

ఈ రెండు చిత్రాల విజయానికి దర్శకుడు సింగీతం ఎంతేని సహకరించాడు. రెండు భిన్నమైన కథలను, విభిన్న రుచులున్న ప్రేక్షకులచేత అంగీకరింపచేశాడు.

ఇప్పుడు సింగీతం సీజన్ ప్రారంభమైంది. ప్రస్తుతం ఆయన విశ్వభారతివారి ''తరం మారింది'' షూటింగులో నిమగ్నమై వున్నారు.

శివప్రసాద్ మూవీస్‌వారి తరువాతి చిత్రానికి, నవత చిత్రవారి మూడవ చిత్రానికి సింగీతంగారే దర్శకులు.

స్వర్గీయ కె. వి. రెడ్డిగారు తన శిష్యుడి ప్రతిభను, వెలుగును అక్కడ్నుంచే దీవిస్తున్నారు.

— శ్రీనివాస్ ●

'ప్రేమించి పెళ్ళిచేసుకో'లో
మురళీమోహన్, జయచిత్ర



## మద్రాసీలుగా ప్రసిద్ధికెక్కాల్సిందేనా మనం?

# పెద్ద షేమ్!

# తెలుగు వారెక్కడ?

కృష్ణప్రియ

ఏషియన్ ఇంపోర్టర్సు తరుపున ఏజంటుగానూ, డిజైనరుగానూ సెప్టెంబరు 23 వ తేదీని అక్బరు హోటలు ఎగ్జిబిషన్‌లో గ్రీన్ కార్డు చేత పుచ్చుకుని తిరుగుతున్న నాకు —

ఆ మర్నాడు అశోకా హోటల్లో ప్రారంభించబోయే బొంబాయి (అసోసియేషన్సు) వారి ఎగ్జిబిషన్ ఎలావుండబోతుందో — తెనుగువారి స్టాల్సు యెలా అలంకరిస్తారోనన్న కుతూహలంతో—మనసు పరి పరి విధాల పోతోంది.

లాంఛనప్రాయంగా అశోకాలో ఎగ్జిబిషన్ ప్రారంభించారు. హేంబర్గు దిగుమతిదారునితో కలిసి మొదటగా తమిళనాడువారి దుకాణంలో ప్రవేశించి వారి దగ్గరున్న "**తయారు** దుస్తుల్ని" వాటికి ఉపయోగించే నేతబట్టల ముక్కల్ని వ్యాపార దృష్టితో చూస్తూండగా —

వారు తమిళదేశంలో స్థిరపడిపోయిన తెనుగు నాయుడులని, వారి దగ్గరున్న మచ్చు బట్టలన్నీ కొవ్వూరులో తయారవుతాయనీ విని నేనాశ్చర్య పోలేదు. కాని, విదేశాల్లో విస్తారంగా వాడబడుతున్న అరవై ప్లస్ నలభై పదుగు పేకలతో తయారించబడే ఈ బట్టల గొప్ప పేరు మాత్రం

"మెద్రాస్ చెక్—మెద్రాస్ కాటన్ — మెద్రాస్ గాడా" ఇవే పేర్లు ప్రపంచమంతా. "మరి అగ్గి పెట్టెల్లో ఆరు గజాల చీరలు మడిచిపెట్టిన ఆంధ్రులెక్కడ ?"

ఆంధ్ర టెక్స్‌టైల్స్‌లో ప్రవేశించిన నాకు చాలా సంతోషమయింది. అతి సుందరమైన నేత పనిలో అందాల రంగుల్లో డిజైనర్ల ఆలోచనలకి రూపం నింపే టెక్స్‌టైల్సు చూసి తమిళనాడువారి స్టాల్లో కలిగిన మనస్తాపం మాయమయింది.

నా కుతూహలాన్నీ, నన్నూ పరిశీలించిన ఎ. పి. టెక్స్‌టైల్ ఎక్స్‌పోర్టు మేనేజింగ్ డైరక్టరుగారు సరళమైన తెలుగు భాషలో పలకరించి—నేను తెనుగువారమ్మాయినేనని నిర్ధారణ చేసుకుని — మరింత విపులంగా శాంపిల్సు — వాటి ధరలు — ఎగుమతి విధానాలు వివరించారు. ఈ శ్రద్ధ ప్రతి ఒక్కరు చూపితే — మన ఆంధ్రులకు మారుపేర్లు పెట్టుకుని ప్రగతి సాదించే దుర్గతి పట్టదేమో.

ఈ ఆంధ్ర టెక్స్‌టైల్ చాలావరకు తమిళ్‌నాడు చెట్టియార్లు (వీరు చాలావరకు సిసలైన తెనుగువారు) చీరాల, కొవ్వూరు, నారాయణపేట్, ఇంకా నాకు తెలియని ఊళ్ళనించి కొనేసి, మెద్రాసులో పాతరవేసి యెంచక్కా ఢిల్లీ, బొంబేలకి ఎఫ్. ఒ. బి. చేస్తున్నారు. ఇంతెందుకు? నేను డిజైన్ చేసిచ్చి వాటికి ఆర్డర్సు దొరికేక, ఎక్స్‌పోర్టర్సు నాదగ్గరకి వచ్చి —

"మీరు మెద్రాసువారుకదా (ఇది కూడా తెచ్చుకున్న పేరే మరి) మంచి సప్లయరు పేరు చెప్పండి వాళ్ళకి ఆర్డరిచ్చి, బట్ట కొంటా**ము**" అంటారు.

ఇరవైవేల చొక్కాలకి ఆర్డరు గనుక వుంటే దాదాపు నలభైఐదువేల మీటర్ల బట్ట కొంటారన్న మాట. ఇలా లెక్కపెట్టుకుంటూ చూస్తే — పేరూ, వూరూ లేకుండా మన ఆంధ్ర నుంచి తయారయే బట్టనే మెద్రాసు వర్తకుల దగ్గర్నుంచి కొ…న్నారు ఢిల్లీ వర్తకులు. నా ద్వారా కొన్ని లక్షల మీటర్లు కొనివుంటారు వీళ్ళు.

ఆరోజు వరకు మన ఆంధ్రులింత చక్కని బట్ట తయారు చేస్తున్నారని తెలిసేందుకు సిగ్గుపడ్డాను.

ఆరోజు "కాక్‌టైల్ పార్టీ" ఎగుమతిదార్లు, దిగుమతిదార్లు హాయిగా కాలం గడిపేందుకు చక్కని సమయం. నాతోటూ జర్మన్‌బయ్యరూ, నేను వివిధ ప్రాంతాల నేత పనుల గురించి మాట్లాడుతూ బార్ దగ్గరకి చేరాము బయ్యరుగారు విస్కీ కలుపుకుంటూంటే, నా కళ్ళు యాపిల్ జూస్ సీసాలకోసం గాలిస్తున్నప్పుడు...

"హలో కృష్ణా!" అన్న తెనుగు వాక్యాలకి వెనక్కి తిరిగి చూసేను రావుగారు! వీరు బొంబాయిలో ఒక పెద్ద ఎక్స్‌పోర్టు కంపెనీలో ఒకప్పుడు మేనేజరు (ఇప్పుడు షేరుదారు.) వీరికి, నాకు హేంబర్గులోనే పరిచయం వీరు నూరుపాళ్ళు ఆంధ్రులు. ఉదయంనుంచి నా మనసులో అణిగివున్న బాధ బెలూన్లా పగిలిపోయింది. విస్కీలో ఐసుముక్కలు వేసి పెట్టి రావుగార్ని మాటల్లోకి లాగటానికి ప్రయత్నించేను.

"రావుగారూ! మన ఆంధ్రా స్టాల్ చూసేరు కదూ ?"

చూశానన్నట్లు తలూపారాయన.

"దాన్లో బట్టల నాణ్యాన్ని — అందాన్ని చూసేరా ?"

"అహా !"

"చాలా బాగున్నాయి కదండీ ?"

ఈసారి తప్పనిసరి అన్నట్లు తల మాత్రం ఊపేడాయన.

"మీదగ్గర చాలా ఆర్డర్సున్నాయి కదా! ఎక్కువయిన ఆర్డర్సుని ఆంధ్రా ఎక్స్‌పోర్టర్సుకి (లెటర్ ఆఫ్ క్రెడిట్) ట్రాన్స్‌ఫర్ చెయ్యండి!



# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
## మీ పైర్లకు అవసరం
# విజయ్

మీ పిల్లలు దృఢంగానూ, ఆరోగ్యంగానూ వుండా లంటే పుష్టికరమైన ఆహారం అవసరం. అలాగే మీ పంటలు బాగా పండి, మంచిలాభాల నివ్వా లంటే నత్రజని, భాస్వరం, పొటాష్‌లను సరియైన పాళ్లలో మీ పైర్లకు అందజేయాలి.

మిగతా పంటల్లాగా చెఱకుకుకూడా పై మూడు పోషకపదార్థాలు సరియైన పాళ్లలో వేసినట్లయితే. దిగుబడులు పెరిగి మంచిలాభాలు చేకూరుతాయని పరిశోధనా ఫలితాలు ఋజువుచేస్తున్నాయి. నత్రజని లభింపజేసే యూరియా మాత్రమే పైర్లకువేస్తే సరిపోదా అని కొందరు భావించవచ్చు. చెఱకుకు యూరియా మాత్రమే వేసినట్లయితే:

* వ్రేళ్లు సరిగా పెరగక గడలు క్రిందకు పడిపోయి, ఎండిపోవటంవల్ల రసం దిగుబడి బాగా తగ్గిపోతుంది.
* నాణ్యమైన బెల్లం/చక్కెఱ తయారవదు.
* భూసారం క్రమేణా తగ్గిపోయి, పంట దిగుబడులు నానాటికి క్షీణించిపోతాయి.

కనుక నత్రజనితోపాటు, భాస్వరం, పొటాష్‌లను చేర్చినట్లయితే కొంచెం ఎక్కువగా గాలివీచినా చెఱకుగడలు పడిపోవు, త్వరగా కాపుకు వస్తుంది; మేలురకపు బెల్లం/చక్కెఱ తయారవుతుంది. అంతే కాకుండా మొక్కలు నీటి ఎద్దడిని, చీడపీడల తాకిడిని తట్టుకోగలుగుతాయి. విజయ్ 17-17-17 కాంప్లెక్స్‌లో చెఱకు పంటకు అవసరమైనట్లుగా నత్రజని, భాస్వరం, పొటాష్‌లు సరియైన పాళ్లలో వున్నాయి. దీనిని దుక్కిలో వేయండి. పైరు మీద చల్లటానికి అనువైంది విజయ్ యూరియా. సిఫార్సుచేసిన విధంగా విజయ్ ఎరువుల్ని వాడి లాభాలను ఇనుమడింపజేసుకోండి.

విజయ్ ఎరువులను వాడండి — అధికలాభాలను పొందండి.

ఇంకా వివరాలు కావాలంటే ఈ క్రింది వారిని సంప్రదించండి.

ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్,
హైదరాబాద్ - 500 028









MFL-1398

# తెనుఁగువారెక్కడ?

"మీరు మద్రాసు నుంచి కొనేబదులు మన ఆంధ్రుల దగ్గర్నుంచే కొనండి." అన్నాను ఆత్రంగా, ఆవేదనగా.

రావుగారి నోటి దగ్గరకు పోబోయే విస్కీ గ్లాసు మధ్యలోనే ఆగిపోయింది. నా మొహంలోకి ఒక సెకను రెప్పలార్పకుండా చూసి, మరుక్షణం పొట్ట చెక్కలయేలా నవ్వటం మొదలుపెట్టేడు. అతని నవ్వు చూసి తెల్లబోయి — చిన్నబోయిన నన్ను చూసి ఏమిటో తెలుసుకోవాలన్నట్లు దగ్గర చేరేరు మరో యిద్దరు. జర్మను బయ్యరు — నేను చెప్పి నవ్వించిన జోక్ ఏమిటో చెప్పమని ఇంగ్లీషులో సతాయిస్తున్నాడు.

నవ్వు నాపుకుని, చేతిలో గ్లాసెత్తి గడగడా తాగేసి ... నాదగ్గరగా వచ్చి, భుజంతట్టి మరీ చెప్పేరు రావుగారు.

"ఆంధ్రా అమ్మాయిగారూ! మన టెక్స్‌టైల్సు వారి శాంపిల్సు అట్ట వెనక ఏమని రాసేరంటే — మాసానికి నాలుగువేల మీటర్లు సప్లయి చెయ్యగలమని. అది చదివిన ఇంపోర్టరు చచ్చినా ఆర్డరివ్వడు. ఇక ఇండియాలోవున్న మాట కదూ! మాసానికి నాలుగువేల మీటర్లు మనవాళ్ళ దగ్గర కొని ... మిగిలిన "ఇరవైఒక్క వెయ్యికి" తమిళ్‌నాడు పరుగెట్టటం సాధ్యం కాదు మరి! తమరుకూడా యీ లైన్లో నాలుగేళ్ళు తల పండినవారే కదా. ఏమంటారు మేడమ్!"

అలా అనేసి నాదగ్గర్నుంచి కాస్త దూరంగా ఎక్స్‌పోర్టర్ల గుంపులో కలిసిపోయేరు రావుగారు.

అలా ఆయనవయిపే చూస్తూ నిలబడిపోయేను. దూరంగా నీలిరంగు పరుచుకున్న కాంతిలో ... ప్రేమానందంగారూ, వారి పక్కన ఆంధ్రా టెక్స్‌టైల్సు తాలూకు డైరక్టరు బండార్కరు గారూ నిల్చివున్నారు. డైరక్టరుగారు తెనుగువారు కాదు.

"ఎలాగైన తెలంగాణాలో — సోమరితనాన్ని పోగొట్టి, యీ వృత్తి తెలిసినవారికి జీవనోపాధి కల్పించాలమ్మా! మీరు గనక సహకరిస్తే..." అంటూ తెలుగు పేదలకోసం ఆరాటపడే ప్రేమానంద్‌గారి మాటలు చెవుల్లో గింగురుమంటూంటే చేతిలో వున్న యాపిల్ జూస్ గ్లాసు క్రిందపడింది.

"వాట్ హేపెన్డు కృష్ణా!" అంటూ జర్మను బయ్యరు గాభరాగా అడుగుతుంటే కృష్ణానది నీటిపాయల్లా జారుతున్నవనుకుంటాను నా కన్నీళ్ళు.

"హల్లో మేడమ్!" అంటూ ఒక బట్టల వర్తకుని పలకరింపులో దొర్లే మళయాళ యాసతో యీ లోకంలో పడ్డాను.

"కేరళా (కన్ననూర్) క్రేప్ — మెడ్రాస్ చెక్" అంటూ ఎగబడే విదేశీయులకు నేను కేవలం మదరాసీ డిజైనరుగా కనపడటం, పిలిపించుకోబడటం అలవాటే. అయినా నేను తెలుగుగడ్డలో పుట్టేను. నాకు తెలుగు తప్ప ఏ భాషా రాదు (చదువుకోలేదు.) నూటికి కోటికి — తెలుగువారి కోసం (పేదలకి చెయ్యూత నివ్వాలని) ఆరాటపడే "ప్రేమానందులు" నాకసలు కనిపించరు. పేరాశగా పది దేశాల్లో — పది పరగణాల్లో నా తెనుగుతనాన్ని గుర్తించాలనుకునే నన్ను చూసి తెనుగువారే నవ్వితే?

కాని, నేను — నేను యింకా మదరాసీగా పిలవబడుతున్నాను.

---

## మగదిక్కు

(24 వ పేజీ తరువాయి)

"బాగా చెప్పావు! ఈ మూఢాచారం అనేవాళ్లే ఒక ఆంజనేయోపాసకు డున్నాడనుకో, అతనికి పిలక వున్నదనుకో, అతడు మహిమలు కూడా చూపిస్తాడనుకో, అమాంతంగా కాళ్లమీద పడిపోయి, పాదోదకం కూడా త్రాగుతారు. అప్పుడు పిలక అడ్డం రాకపోగా, అది విశేషం అవుతుంది"

"సురేఖగారూ! మీరు తెగించి వారి దగ్గఱకు వెళ్ళిపోవాల్సింది."

"ఆ పని చేయలేకపోయాననే రోజూ ఏడుస్తూ వుంటాను. మావారు ఆ అవమానం జరిగిన తర్వాత, అత్తవారింటికి రావడం మానివేసి, రెండు మూడు పర్యాయాలు జాబులయితే వ్రాసారు నన్ను పంపమని. మా నాన్న లక్ష్యపెట్టక "ఎప్పుడో అప్పుడు రాక ఏం చేస్తాడు? పెళ్ళాం కావలసినవాడు మహచక్కగా వస్తాడు." అన్నాడు. మా అమ్మ "బంగారంలాంటి పిల్లను తీసుకువెళ్ళి శ్రీనాధుడు ఎగతాళిచేసిన బాక్‌వర్డ్ ఏరియాలో చూస్తూ చూస్తూ పారవేయలేం" అంది.

"మీ నాన్నకు తగ్గ దేనే, మీ అమ్మకూడా!"

"మూరుఖులమ్మా! పరమమూరుఖులు! ఎక్కడ మొగుడుంటే అక్కడ పెళ్ళాం వుండాలనే చిన్న విషయం తెలియనివాళ్ళను ఏమని అనాలి? నా కర్మకొద్దీ, వాళ్ళు కళ్ళు మూసుకుపోయి, భవిష్యత్తును గూర్చి ఆలోచించడం మానివేశారని అనాలి. లేదా అనుకోవాలి. నా కప్పటికి కొంత యింగ్లీషు వచ్చు. నన్ను యింకా చదివించాలని నాన్న వుద్దేశం. పిల్లను పంపేది లేదనీ, పెళ్లాం కావలసినవాడయితే, వచ్చి యిక్కడే వుండమనీ మావారికి మా నాన్న జాబు వ్రాశారు. సిగ తరిగిన చోటుకు వారు వస్తారా? సిగ తరగడం అనేది మనలో తిట్టుక్రింద కూడా లెక్కకదా! చూసి చూసి, వారు మళ్ళీ పెళ్లి చేసేసుకున్నారు."

"ఘోరం!"

"ఎవరిది ఘోరకృత్యం? మా పుట్టింటి వారిది ఘోరకృత్యం. వారిని బానిసనుగా చేసుకోవాలని చూశారు. కుక్కకాటుకు చెప్పుదెబ్బ—అన్నట్లు ఆత్మగౌరవం వున్నవారు కనుక వారికి తగిన పని వారు చేసి ఊరుకున్నారు. మన విషయం వదలి, విచారిస్తే మావారు చేసిన పనిలో తప్పు నాకేమీ కన్పించడంలేదు. ఇందులో నేను నష్టపడ్డాను. పుట్టింటివారిని ఎదిరించలేకపోవడం తప్ప, నేను చేసిన తప్పుకూడా ఏమీ లేదు."

"నిజం."

"మెట్రిక్ పూర్తిచేసి ట్రయినింగ్ అయాను. మా నాన్నగారి ఆర్థిక పరిస్థితి తారుమారయింది. గుంటూరు నుంచి కుటుంబం అంతా విజయవాడ వచ్చేసింది. నాకు వుద్యోగం యిప్పించారు "ముద్ద కావాలిగా!" అందుకని వుద్యోగం చేస్తున్నాను. వారు రెండవ వివాహం చేసుకొనివుండకుండా వుంటే, తెగించి వారి దగ్గరకు వెళ్ళి, ఆ ఇంట్లో దాసీగా నయినా పడివుండేదాన్ని కాని, చచ్చినా వుద్యోగం చేసేదాన్ని కాదు. వారు పెళ్లి చేసుకున్నా వెళ్లవచ్చును కాని, వారి సుఖానికి భంగం కలుగవచ్చు ననీ, రెండవభార్య ఉసూరుమంటుందనీ వెళ్ల లేదు."

"రెండవ సంబంధానికేమయినా పిల్లలా?"

'పెళ్లి చేసుకునేదే అందుకు కదా! అవన్నీ మామూలే. ఉండే వుంటారు! దురదృష్టవంతురాలను నేనుకాని, వారికే లోపం వుండదు, ఆమెకూ లోపం వుండదు, ఆ అదృష్టంలో. నాకేమీ వివరాలు తెలియవు.అసలువారితోసంబంధమేతెగిపోయిందికదా!'

"ఇల్లాంటి సందర్భాలలో, ఇద్దరినీ ఏలుకున్న వాళ్ళు వున్నారని మా నాన్నగారు చెబుతూ వుంటారు. అల్లా జరిగినా బాగుండును!"

"నిజమేకాని, అది అంతతేలిక కాదమ్మా! మగవాడు ఏదో తొందరపడి రెండవ పెళ్లి చేసుకుంటే, ఊళ్ళోవాళ్ళు నలుగురూ ఇది తగదనిచెబితే, ఏదో ఒక పరిష్కార మార్గంగా మొదటి భార్యను కూడా ఏలుకోవడం వుంది" సురేఖకు దుఃఖం ఆగలేదు.

"నా విషయం వేరుకదా! నేనే ఆయనను వదలివేసినట్లు అయిందికదా! మా పుట్టింటివారి చర్యను నేను ఆమోదించినట్లేకదా! ఇన్నేళ్లతర్వాత వారి ముఖం ఏమని చూడగలను?" అని ఏడ్చింది.

"కష్టమే."

"ఇంత అగ్నిపర్వతాన్ని లోపల ఇముడ్చుకొని, గతిలేక, వుద్యోగం చేస్తున్నానమ్మా, సరోజనమ్మా!" అంటూ గడియారంవంక చూసింది.

'చాలాప్రొద్దుపోయింది. వెళ్లివస్తాను. మిమ్మల్ని ఆత్మీయులుగా భావించుకునినాహృదయాన్నివిప్పాను.'

సరోజిని కళ్లు చెమర్చినై.

వీధిగేటుదాకా సురేఖను సాగనంపి, తాను వచ్చి మంచంమీద కూలబడి ఇల్లా అనుకుంది:

"పెద్దవాళ్లను కాదనడం మంచిపని కాదు. కాని భగవంతుడు వారికి సద్బుద్ధిని ప్రసాదించాలి. సురేఖ తల్లిదండ్రులు ఆమె జీవితాన్ని తమ మూరఖత్వానికి బలిపెట్టారు.

సురేఖ తెగించి భర్తతో అత్తవారింటికి వెళ్ళి, పోయివుంటే ఎంతయినా బాగుండేది! కాని తనను పెంచి పెద్దదానిని చేసి, పెళ్లి చేసి, చదువు చెప్పించిన తల్లిదండ్రులను ధిక్కరించలేకపోయింది.

ఒకప్రక్క తల్లిదండ్రులూ, వేరొకప్రక్క భర్తా, ఈ రెండు పక్షములలో ఎటు మొగ్గాలి?అని ఆలోచిస్తే భర్తవంకనే మొగ్గాలి—అని తేలుతుంది.

అతని మార్గం ధర్మయుక్తంగా కూడా కన్పిస్తోంది. పెళ్లి అయి కూడా ఆమె వయస్సు ఎంతో వృధా అయిపోయింది. నా వయస్సు పెళ్లి కాక వృధా అయిపోతోంది. ఈ సమాన లక్షణం వుండడంచేతనే ఇద్దరూ దగ్గరవారమయామేమో! తండ్రి, అన్నలూ సురేఖను కడుపులో పెట్టుకున్నారు — ఆమెకు ఒంటరితనం బాధ అట్టే కనపడనీయకుండా. ఇది గ్రుడ్డిలో మెల్ల' ఇంతలో శేషయ్య వచ్చాడు. [ఇంకా వుంది]

# జీవన్ టోన్ 20 వ శతాబ్దపు ఆరోగ్య టానిక్



రెండు పౌన్లు ఉపయోగించిన తరువాత    నాలుగు పౌన్లు ఉపయోగించిన తరువాత    ఎనిమిది పౌన్లు ఉపయోగించిన తరువాత

అలసట, బలహీనం, నిద్రలేమి, బరువుతగ్గుదల, ఆకలి లేకపోవడం తగ్గిపోయావే అనే దిగులుకి పిన్నలు, పెద్దలు కూడా వాడదగిన ఆదర్శ టానిక్. 3 లేక 4 కిలోగ్రాముల జీవన్‌టోన్ మాత్రమే మీకు కావలసిన బరువు, ఆరోగ్యం ఇస్తుంది. ఇది జంతు కొవ్వులు కలిసినది అనీ, అందుచేతనే త్వరగా బరువు, ఆకారం ఎక్కువ అవటానికి సహాయం చేస్తుందనీ కొందరికి అనుమానాలున్నాయి. వారికి దీంట్లో కాయగూరల క్రొవ్వు, అరుదైన మూలికలు మాత్రమే ఉన్నాయని చెప్తున్నాం.

కావలసిన బరువు వచ్చింతర్వాత ,మందు తీసుకోవడం ఆపివెయ్యాలి.

***450 గ్రాముల మందు వెల రూ. 14-00***

సెల్ బాయిల్ మరియు సెల్బొపౌడర్ (మగవారికి మాత్రమే) రు. 20–00.

స్కిన్‌లిన్స్ : మొటిమల్ని మాన్పి, ముఖాన్ని అందంగాను, కాంతివంతనుగాను చేస్తుంది.

2 అవున్సుల మందు రు. 15/- జీవన్‌టోన్ ప్రొడక్ట్సుకొరకు ఈక్రిందిస్టాకిస్టులను సంప్రదించండి:

★ నెల్లూరు : కె. యస్. రావు & సన్సు. ★ కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. ★ సూర్యరావ్‌పేట : కమర్షియల్ సూర్యనివాస్. ★ సికింద్రాబాద్–3 : డి. జె. పరెక్ & కంపెనీ, సుభాష్ రోడ్డు, జుమ్మామసీదు దగ్గర. ★ సికింద్రాబాద్ : శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. ★ గుంటూరు–1 : ఆంజనేయ మెడికల్స్, జిన్నాటవర్ దగ్గర, ట్రాంకు రోడ్డు. ★ విజయవాడ–1 : సూర్యామెడికల్ స్టోర్సు, పార్కు రోడ్డు. ★ విజయవాడ 3 : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్. ★ అనకాపల్లి : కొసుమంచి అప్పలరాజు, మెయిన్ రోడ్డు. ★ హైదరాబాద్–1 : ఆయుర్వేద్ మెడికల్ హాల్, కోటి బస్‌స్టాండ్ ఎదుట. ★ హైదరాబాద్ : వసంత్ మెడికల్‌స్టోర్స్, 4–4–293, బ్యాంక్ రోడ్. ★ శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ & సన్సు, పాలచెట్టు స్ట్రీట్. ★ విజయనగరము : భట్టుల లింగప్రసాద్‌రావు, మెయిన్‌రోడ్డు. ★ విశాఖపట్నం : నీలమ్ & కంపెనీ, ఎ.వి.ఎన్. కాలేజీరోడ్డు. ★ మదనపల్లి: హయగ్రీవ్‌షాప్, 6/77–నె.హాస్ట్రీట్. ★ రాజమండ్రి : ఈశ్వర్‌దాస్ & కంపెనీ, జైహింద్ బిల్డింగుదగ్గర. ★ సికింద్రాబాద్ : సూర్యామెడికల్‌హాల్, జుమ్మామసీదు. ★★★ ఆంధ్రా స్టాకిస్టులు అందరు మా సోల్ డిస్ట్రిబ్యూటర్సును దయవుంచి సంప్రదించండి : మెస్సర్స్ అక్మిట్రేడ్ ఏజన్సీ, పి.బి. నెం. 116, పులిపాటివారి స్ట్రీట్ విజయవాడ–1, (ఏ. పి.). కర్నాటక స్టేట్ : బెంగుళూరు–1 : జనతా మెడికల్‌స్టోర్స్ శివాజీనగర్, బస్‌స్టాండు ఎదుట. ★ బెంగుళూరు 2A, : సిటీ మెడికల్స్ అండ్ జనరల్ ఏజన్సీస్ చిక్‌పేట్. ★ మాంగళూర్ : శారద ఎంటర్‌ప్రైజెస్ 1–727 టెంపుల్ రోడ్డు. ★ హస్సన్ : శ్రీ కృష్ణ స్టోర్సు, సుబాస్ స్క్వేర్. ★ షిమోగా : ది మైసూరు మెడికల్ స్టోర్సు, బి. హెచ్. రోడ్డు. ★ సాగర్ : శ్రీ మల్లికార్జున స్టోర్స్, మహాలక్ష్మి స్టోర్స్. ★ ఉడిపి : మైసూర్ ఆయుర్వేదిక్ మెడికల్స్ శంతకట్ట. కుమ్‌టా : కుమ్‌టా పార్మసీ, కార్ స్ట్రీట్. ★ తమిళనాడు మరియు మహారాష్ట్ర మద్రాసు–3 : కమల కాఫీ వర్క్సు, 18, పూందమల్లి హైరోడ్డు. ★ బొంబే–9 : మలబార్ మెడికల్ హాల్ 24, జక్రియా మసీదు స్ట్రీట్. ★ బొంబే–28: జయంతి జనరల్‌స్టోర్సు, దాదర్ స్టేషన్ ఎదుట.

ఈ క్రింది అడ్రస్‌కి వి. పి. పి. కొసం వ్రాయండి.

**Manu facturing Licence No. A.V.S. 59/75**

TRADE  MARK

**Regd No.218726.**

## జీవన్ టోన్ ప్రొడక్ట్స్

పి.బి. నెం. 880, 17/1 కేంబ్రిడ్జిరోడ్, ఉల్సూర్, బెంగుళూర్–560008.

రచయిత్రి:– ప్రముఖ సినిమా నిర్మాత సుబ్బారాయుడిగారి దగ్గర నుంచి నిన్ననే కబురు వచ్చింది–ఆయన తీయబోయే తదుపరి చిత్రానికి కూడా కథను నన్నే వ్రాయమంటు న్నారు. 'అందమైన కథ' వ్రాయమని మరీ మరీ చెప్పి పంపించాడు. ఆయన నా నవలను సినిమాగా తీస్తున్నట్టుగా అప్పుడే పత్రికల వాళ్ళకి 'న్యూస్' కూడా యిచ్చేశారుట – అంటే ఒక వారం రోజుల లోపలే నవల పూర్తిచేయాలన్నమాట.

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తు న్నావ్?" అన్నారు శ్రీవారు ఆఫీసు నుంచి వస్తూ.

'అదే చెప్పాను కదా – సుబ్బారాయుడిగారి సినిమాకి కథ గురించి ఆలోచిస్తున్నాను' అన్నాను సాలోచనగా.

'వంట అయిందా?!' అడిగారు మామూలుగా.

'అయినట్టే - కూరలో పోపు పెట్టాలి!' అన్నాను లేస్తూ.

ఆయన నవ్వారు. 'ఆ వంట కాదు – నీ నవలను వండటం. ఈసారి పోపు యింకా బాగా పెట్టు – సుబ్బారాయుడికే కాదు, ప్రేక్షక రాయుళ్ళకు కూడా ఘుమాయిం చాలి!'

కోపంగా చూశాను 'నా రచనలనలా తీసి వేయవద్దని మీకెన్నోసార్లు చెప్పాను–'

'కోప్పడకు చిట్టీ – మరి నీ నవలలోని పాత్రలు సాంఘిక ప్రయోజనం లేకుండా, సహజత్వానికి దూరంగా, ఊహాలోకాల్లో నేల విడిచి సాము చేసాయి–' అంటూ దగ్గరకు వచ్చారు.

ఆ రాత్రి కూడా అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను.

తెల్లవారగానే ఆయన అడిగారు 'కథా వస్తువు దొరికిందా?' అని.

'లేదు!' అన్నాను నిరాశగా.

'మళయాళం, బెంగాలీ, కన్నడ వాళ్ళలాగా, ఉన్న ఉత్తమమైన కథల్ని, చక్కగా సినిమాలు తీసే అదృష్టానికి మనం నోచుకో లేదు. ఏదో కథ లాంటేది, కథలు వ్రాసే లాంటి వాళ్ళచేత, వ్రాయించినట్టు వ్రాయించి, సినిమా తీయాలంటే ఎలా!' ఆయన ఎప్పుడూ విమర్శిస్తూనే వుంటారు.

'మీరు ప్లాటు యిస్తే యివ్వండి. అంతే

కాని ఈ ఉపన్యాసాలు నా కక్కరలేదు' అన్నాను విసుగ్గా.

ఆయన కూరల బుట్టకేసి చూస్తూ, చటుక్కున ఒకసారి తల ఎత్తారు.

'నే నొకటి చెబుతాను విను. అటు మొన్న బంగాళాదుంపకూర, మొన్న చిక్కుడు కాయ కూర, నిన్న వంకాయ కూర వండు కున్నాం మన యింట్లో. ఇవాళ వండటానికి కూరలు లేవు. కానీ కూర వండి తీరాలి.




అప్పుడు నువ్వేం చేసావ్? కూరల బుట్టలో మిగిలిన ఒక వంకాయ, నాలుగు చిక్కుడు కాయలు, ఒక బంగాళాదుంప తీసి, అన్నీ కలిపి వండేస్తాన్. కాపోతే రుచి కోసం కొంచెం మసాలా కలిపాలి అంతే' అన్నారు.

ఆయన ఆఫీసుకు వెళ్ళేదాకా ఆయన మాటల్లోని వ్యంగ్యం గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను. ఈలోగా, వచ్చిన మేగజైన్‌ను తీసి, పేజీలు తిప్పుతూ ఆలోచిస్తున్నాను.

నే నింతవరకూ వ్రాసిన మూడు నవలలూ సినిమాగానే వచ్చాయి. నాలుగోది వ్రాయక ముందే, సుబ్బరాయుడుగారు దాన్ని సినిమాగా తీయటానికి నిశ్చయించుకోవటమేకాక, ప్రెస్ పబ్లిసిటీకి కూడా యిచ్చేశారు. అది గుర్తుకు రాగానే ఆ మేగజైన్‌లో సినిమా పేజీలు తిప్పాను. దాంట్లో కూడా నా నవలను సినిమాగా తీస్తున్నట్టుగా వుంది. నేను వ్రాసిన (?) అముద్రితమైన నవలను సుబ్బారాయుడుగారు ఈస్ట్మన్ కలర్‌లో తీస్తున్న నిజాన్ని విలేఖరిగారు తెలియజేశారు.

'ఈసారి రచయిత్రి బలమైన కథను తీసుకుని, చక్కటి సన్నివేశాలను కూర్చారు. అగ్ర నటుడు ఈ కథ చదవగానే, ఆ నవలలోని హీరో పాత్ర తనకి యివ్వకపోతే, యిక సినిమాలలో నటించడం మానేస్తాననే నిజాన్ని తెలిపారు. ఈ నవలలోని హీరోయిన్ పాత్రను షి—వుమెన్ తప్ప యింకెవ్వరూ వేయలేరనే మాట. ఈ నవల చదివిన పాఠకు లందరూ ఒప్పుకుంటారనే ధైర్యం ఈ విలేఖరికి వుంది. ఈ చిత్రం యింతవరకు కనీవినీ ఎరుగనంతటి గొప్ప సృష్టి' అంటూ ఇంకా ఏదేదో వ్రాశాడు విలేఖరి. నాకు నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. నేను నవల ఇంకా వ్రాయనేలేదు, అప్పుడే దానికి ఎంత పబ్లిసిటీ వచ్చిందో. ఆ వార్త క్రిందే నాకు సంబంధం లేకపోయినా— యింకో వార్త వుంది.

''ఫలానా స్టూడియోలో 'నటశూర' ను కలసి నప్పుడు ఆయన్ని అడిగాను— మీరు ఒకే సారి డెభ్బయి సినిమాల్లో నటిస్తున్నారు, యింత ఓపికకు కారణం ఏమిటో మాపాఠకు లకు తెలిపిస్తారా అని ఆయన చెప్పిన నిజాన్ని మీకు కూడా ఉపయోగ పడుతుందేమోననే వుద్దేశ్యంతో మీకు చెబుతున్నాను. ఆయన రోజూ పడుకోబోయే ముందు రెండు గ్లాసులు మజ్జిగ త్రాగి పడుకుంటారుట ఆ వార్త చదవ గానే గొంతు ఎండి నట్టు యింది. లేచి వెళ్ళి, రెండు గ్లాసుల మంచి నీళ్ళు త్రాగి, కాగితాలు ముందు వేసుకు కూర్చున్నాను.

మా వారు వెడుతూ చెప్పిన 'వంకాయ' కథలో ఏదో సందేశం కనపడ్డట్టయింది. వెంటనే షెల్ఫులోంచి పబ్లిష్ అయిన నా మూడు నవలలు తీసుకున్నాను— అవిచూస్తూ నాలుగో నవల వ్రాయటం మొదలు పెట్టాను.

ఆ రోజు రాత్రి మావారు, కంచంలో వేసిన కూరను చూసి అదిరి పడ్డారు. ''అయితే వంకాయ చిక్కుడుకాయ,బాంగాళా దుంపలు కలిపి కూర వండే వన్నమాట!'' అన్నారు.

''ఇంకా పూర్తిగా వండలేదు. వండుతున్నాను!'' అన్నాను పుస్తకాలు, మళ్ళీ ముందు వేసుకుని.

**నిర్మాత** :—రచయిత్రి వ్రాసిన నవల్లో హీరోయిన్ బీదపిల్ల. అందుకని హీరోయిన్ ఆ వేషం వేయటానికి అంగీకరించటంలేదు. ఆవిడ ఎర్రరాళ్ళ నెక్లెస్ వేసుకుని నటించిన ''దేవత లాంటి చెల్లెలు'' చిత్రం వంద రోజులు ఆడినప్పటినించీ, ఆవిడకు అదో సెంటిమెంటు. ప్రతి చిత్రంలో, ఆ నెక్లెస్ వేసుకునే నటిస్తానంటుంది. బీదపిల్లకు ఎర్ర రాళ్ళ నెక్లెసేమిటి? బుద్ధి లేకపోతేసరి— నేనేదో ఒకటి సినిమా తీసి డబ్బులు చేసుకుందామని, ఈ వ్యాపారంలో దిగితే, యిదేం గోల. కథను మార్చి ఆ అమ్మాయిని ధన వంతుల పిల్లగా చేయకపోతే హీరోయిన్ ఆ వేషం వేయదు హీరోయిన్ ఆవేషం వేయక పోతే హీరో ఒప్పుకోడు. పోనీ కథను మార్చి ఆ అమ్మాయిని ధనవంతుల పిల్లగా చూపిద్దామంటే, ఆ అమ్మాయి యింటి సెట్టు కూడా చాల ఖరీదయింది వేయాలి — అదో దండగ ఇప్పుడు నా పరిస్థితి 'టు బి ఆర్ నాట్ టు బి' లాగా వుంది.

*దర్శకుడు*:— నాకు ముందే తెలుసు యిలాటి గొడవలు వస్తాయని.సుబ్బారాయుడు గారు ఈ విషమ సమస్యను నాముందు పెట్టాడు సినిమారంగానికివచ్చి ఇన్నాళ్ళయినా నా బుర్రయింకా పనిచేస్తూనేవుంది నాసలహా విని సుబ్బారాయుడు గారు ఎగిరి గంతేసి, గంతు వేయటం పూర్తి కాగానే, ఆయన తీసే తర్వాత చిత్రానికి కూడా నన్నే డైరెక్టర్‌గా పెట్టుకున్నాడు. నేను యిచ్చిన సలహా ప్రకారం హీరోయిన్ బీదపిల్లగానే వుంటుంది ఇలాగయితే వర్గ భేదం చూపించటానికి అవకాశం ఎక్కువ. వేల టిక్కెట్లు బాగా సంపాదించుకోవచ్చు. పదిహేడు రీళ్ళు ఎంత అవాకులూ చవాకులూ తీసినా, పద్దెనిమిదవ రీళ్ళో, హీరో ధనవంతుడయినా బీదపిల్లను చేసుకున్నాడనీ, ఈ సమాజంలో వర్గ భేదం వుండకూడదనీ (సోషలిజం అన్నమాట) కాస్త హడావిడి చేసి, మహాత్మాగాంధీ నుంచీ ఇందిరాగాంధీవరకు ఒకే పాటలో చూపించేస్తే, యిటు సందేశం



## సృష్టి

యిచ్చినట్టు వ్రాసుకోవచ్చు. అది ఏదో ఒక అవార్డు తగలకపోదు. కాకపోతే హీరోయిన్, బీద వేషానికి నెక్లెస్ ఎలాగని ఏడవ నవసరం లేదు. హీరో రోడ్డు పట్టనంతటి కార్లో వెడుతుంటాడు. అప్పుడు రోడ్డు మీద నడుస్తున్న హీరోయిన్ కారుకి అడ్డు మొస్తుంది కారు ప్రక్కకు పోవటానికిచోటు వుండదు. అప్పుడు హీరో కోపంగా చూద్దామనుకుని ఆమె కళ్లల్లోకి ప్రేమగా చూస్తాడు—ఆమెకూడా అతనివేపు చూస్తుంది —అప్పుడు కారు వైపర్లు అటూయిటూ కదులుతాయి. వైపర్లు వాన నీళ్ళని (వానా?) తుడుస్తుంటే, ఏదో మసకమసకగా కనిపిస్తూ వుంటుంది. ఆ మసక మాయమవగానే, మబ్బులు, పెద్ద పెద్ద స్తంభాలు. మెట్లు, బోలెడు లైట్లు. వేలాడదీసిన ఎన్నోరంగుల నైలాన్ చీరలు వుంటాయి. అంటే అది వాళ్లకు వచ్చే కలలోని సెట్టింగ్ అన్నమాట. ఆ కలలో హీరోయిన్ ఒక రాకుమారి. హీరో ఒక రాజకుమారుడు. ఇద్దరూ గంతులు వేసి పాటపాడుతూ, పాటపాడి మళ్లీ గంతులు వేస్తూ వుంటారు. అప్పుడు హీరోయిన్ మెడలో ఎర్రరాళ్ల నెక్లెస్ వుంటుందన్న మాట అదీ కథ ఈ మధ్య తెలుగు ప్రేక్షకులు దర్శకత్వంలో లోపాలు పట్టేటంత గొప్ప వాళ్లయినారని ఒక దుర్వార్త. అయినా ఏం ఫరవాలేదు. పాటల రచయిత చేత ఒక క్లైపు పాట పెట్టేస్తే సరి. ప్రేక్షకులు ఆ మత్తులో, మాయలో పడిపోతారు. హీరోయిన్‌కు మొత్తం బట్టలన్నీ ఒక పావుమీటర్ స్ట్రెతా నైలాన్‌లో కుట్టించేస్తే, నిర్మాతకి ఆదా, ప్రేక్షకులకు కిక్కు – సెన్సార్‌వాళ సంగతి సుబ్బారాయుడిగారి బొమ్మరిదికి వదిలేస్తే సరి.

**పాటల రచయిత :—** ఈ బూతు పాటలు వ్రాసి వ్రాసీ విసుగు పుట్టేస్తున్నది – ఏమీ బూతుల్లేకుండా, కాస్త కవిత్వంతో చక్కగా సినిమాకు పాటలు వ్రాసి అయిదారేళ్లు దాటిందేమో. ప్రతి నిర్మాతా అలాటివే వ్రాయమంటే, మరేం చెయ్యాలి. నేను బ్రతకొద్దూ? మొన్నెవడో కాలేజీ స్టూడెంట్ వుత్తరం వ్రాశాడు. ఎంతో గొప్ప సాహిత్య పరిశోధన చేసిన మీరు, ఈ సినిమాల్లో చేరి ఈ పనేనా చేయవలసింది అని తిడుతూ వ్రాశాడు. అంతటితో ఆగలేదు. మీకు డబ్బులే ముఖ్యమైతే ఆంధ్రదేశంలోని ముఖ్యనగరాల్లో ముష్టెత్తుకువచ్చి, విద్యార్థులమంతా మీకు డబ్బు యివ్వగలం – అలాటి పాటలు వ్రాసి యువతరాన్ని బలహీనం చేయవద్దని వ్రాశాడు. టూ ఫేస్డ్ ఫెలోస్ అలా మనని తిడుతూనే వుంటారు, మళ్లీ మనం వ్రాసిన పాటలకు కాళ్లూ, తలలూ వూపుతుంటారు.

ఏమయితేనేం సుబ్బారాయుడుగారు, ఈసారి సినిమాలో, ఒక అమ్మాయికి పావు మీటర్ బట్టతో పూర్తి దుస్తులు కుట్టిస్తున్నాడుట అక్కడ ఓ 'మంచి' పాట వ్రాయ



ఏవండోయ్-!
ఈ ముగ్గు అయ్యేసరికి
మధ్యాహ్నం అవొచ్చు-
కాఫీ.టిఫిన్లు కొస్త
తయారు చేయండి-
అన్నట్లు మధ్యాహ్నంకి
కూరగాయలు తరిగి
స్టౌ మీద పెట్టి, ఆ చేత్తో
కాస్త బియ్యం కడిగి
పెట్టండి....!!



మంటాడు. ఏం రాయను. నాకు వచ్చిన బూతులన్నీ యింతకు ముందు పాటల్లోనే వచ్చాయి. మాటలు దొరక్క ఎన్నాళ్ళిలా ఖాళీగా కూర్చోవటం...ఏదో ఒకటి చేయాలి ...ఆఁ! ఆఁ!...దొరికింది పల్లవి ఈ మాటలతోనే ఒక పాట రాసేస్తే సరి. 'ఖాళీగా వున్నాను మామా — ఖాళీగా వున్నాను. ఏదో ఒకటి చేయరా మామా త్వరగా రారా మామా...' బాగానే కుదురుతుంది — నేను రాసేది తిరుపతి వేంకటేశ్వర్లు చూస్తున్నాడు కాబోలు — ఈ పటం ప్రక్కగదిలో పక్కమీద పడేస్తే మంచిది. నా బాధ తిరపతి వెంకన్నకీ, ఆయన బాధ నాకూ తప్పుతుంది.

***అభిమాన సంఘం :-*** రిక్షాలో "నటశూర" పటాన్ని పెట్టి ఊరంత తిప్పి తొమ్మిది గంటలకల్లా థియేటర్ దగ్గరకు తెచ్చేయాలి తర్వాత ఆయన పటానికి, దండవేసి హారతి యివ్వటం.కొబ్బరికాయ కొట్టటం. సినిమాలో మొదటిసారిగా ఆయన కనపడ్డప్పుడు, 'జై' కొట్టటానికి ఇరవై మందిని మాట్లాడమని 'ఆయన' యిచ్చిన డబ్బుతో పదిమందిని పెట్టేయాలి ఈ సినిమా వందరోజులు ఆడాల్సిందే."అవతలివాడి"సినిమా ఈదెబ్బతో మట్టి కొట్టుకు పోవాల్సిందే.

***రిక్షా తొక్కుకునే అప్పుడు :—*** ఏటేను కామన్మ ఈ చినిమా బాగుంటాదని సెప్పి తీసుకొచ్చ ...వ్! ఎదవ చినిమా అని ఎదవ చినిమా! తలా తోకా లేకుండా ఏడే యిది? పొద్దుటాలనించీ రిచ్చా ఏస్తే వచ్చిన రెండ్రూపాల్లో నాయార్డి రూపాయిన్నర తగలేసాం ఈ ఎదవన్నర చినిమాకి ఆబాబు సదువుకున్నాడు గందా ఏటే ఆబాస దురద పుడుతుంది అంటూ ఆ పిల్ల ఎంబడి పడతాడు ఆ ఆడకూతురేమొ కాలీగా వున్నాను కాలీగా వున్నాను అంటది. పద యింటకి పోయి సుకంగా నిద్దరన్నా పోదాం.

***తెలుగు సినిమా అభిమాని అనబడే ఒకానొక మూర్తి :***

అపూర్వ సృష్టి అయిన ఈ చిత్రానికి ప్రభుత్వం కనీసం ప్రాంతీయ బహుమానమైనా యివ్వక పోవటం అన్యాయం, మహా అన్యాయం.

***రచయిత :—*** ఇదీ సార్ 'సృష్టి' కథ!




# విమాన హర్మ్యం

సౌదీఅరేబియా రాజావారు తన ప్రయాణానికి ఓ 747 జట్ విమానంలో ప్రత్యేక వసతులు పెట్టించుకున్నారట. తన పిల్లలకు ఆసుపత్రి, స్నానాల గదులు, పడక గదులు, అవేగాక ఆయన సింహాసనం పెట్టుకుని ప్రయాణం చేయడానికి వీలయిన ఏర్పాట్లూ అన్నీ వున్నాయట.

## సాంబారన్నం పెట్టి దోపిడీ !

బళ్ళారినుంచి గుంటూరు వెళ్ళే ప్యాసింజరు బండిలో అస్సలు జనం లేని ఓ పెట్టెలో ఒకామె తన కూతురుతో, సామానుతో ఎక్కిందట. ఆ వెనుక మరో యిద్దరు పెద్ద మనుష్యులు ఎక్కారట. రైలు నంద్యాల వచ్చాక భోజనం టైమవడంవల్ల ఆ పెద్ద మనుష్యులిద్దరూ పెట్టె దిగి, మీకు సాంబారు పొట్లాలు కావాలంటే తెస్తామన్నారట. ఆవిడ యీ సహాయానికి బోలెడు ఆనందించి డబ్బిచ్చిందట. వారు తెచ్చిన ఆ సాంబారన్నం తిని ఆమె, ఆమె కూతురూ స్పృహ తప్పి పడిపోతే ఆ పెద్ద మనుష్యులు ఆమె వంటి మీది, ఆ పిల్ల వంటిమీది నగలూ, లగేజి వెరసి పదివేలు కిమ్మత్తున్న సరుకులతో అంతర్ధానమై పోయారట.

# ఫైలోకని డైరీ

## విలేఖరి చాకచక్యం !

ఓ భయంకర దోపిడీ దొంగను అమెరికా ప్రభుత్వం పట్టుకుని ఖైదులోవేసి, అతన్ని చూడ్డానికి ఏ పత్రిక ప్రతినిధికీ కూడా అనుమతి యివ్వను పొమ్మందట. ఈ విషయం ఎలాగయినా సాధించాలని ఓ పత్రికా విలేఖరి ఆలోచించి, ఆ జైలు ఎదురింటి కిటికీ అద్దాలు శక్తి కొద్దీ బద్దలుకొట్టాట్ట రాళ్ళేసి. దాంతో అతన్ని అరెస్టు చేసి జైల్లో పెడితే అక్కడి అధికారులను కాకా పట్టి ఆ దోపిడీ దొంగను కలసి, వివరాలన్నీ సేకరించి, తాను బయట పడిన వెంటనే పత్రికకు యిచ్చేశాట్ట.

## అత్తింట్లో భోజనం స్నేహితునింట్లో అంత్య క్రియలు !

ఉడుమాల్‌పేట ఆత్మకిణత్తుపట్టికి చెందిన మయిల్‌సామి అనే అతనికి అప్పిలిపట్టికి చెందిన అమ్మాణియమ్మ అనే ఆమెకూ ఏణ్ణర్థం క్రితం వివాహమై ఎనిమిది నెలల క్రితం ఆమె ప్రసవానికని పుట్టింటికి వెళ్ళి, పిల్లని కన్నా కూడా పుట్టిల్లు వదలి రావడానికి నిరాకరించిందట. మయిల్‌సామి వీలు చిక్కినపుడల్లా ఆ వూరెళ్ళి భార్యను రమ్మని ప్రాధేయపడుతూనే వున్నాడట. అయితే అతనోనాడు తన అత్తింటిలో భోజనం చేసి, స్నేహితునింటికి వెళ్ళి, అక్కడే వాంతి చేసుకున్నాడట. ఈ విషయం ఆ స్నేహితుడు వారికి చెప్తే అత్తగారూ, భార్యా, బావమరిది అంతా ఆ స్నేహితునింటికి వెళ్ళి ఏవేవో ఉపచారాలు చేశారట. ఆసుపత్రికి తీసుకు వెళ్దామంటే అతని భార్య వద్దందట. కాస్సేపటికి మయిల్‌సామి చనిపోయాడట. దాంతో వారంతా ఆలోచించి హడావుడిగా పాతి పెట్టడానికి బదులు అతని శవాన్ని దహనం చేయ తీర్మానించారట. ఇదివిన్న మయిల్‌సామి స్నేహితునికి అనుమానంవచ్చి పోలీసు రిపోర్టు యిస్తే వారు తీగంత లాగి, మయిల్‌సామిని హత్యచేసిన నేరానికి అతనిభార్యను, అత్తగారిని, బావమరిదిని అరెస్టు చేశారట.

## ప్రాణాలను బలిగొన్న ధనాశ !

సేలంకు చెందిన కిచ్చిపాలెం అనే వూరిలో 40 ఏళ్ళ సుబ్రహ్మణ్యం అనే ఆయన వడ్డీవ్యాపారం చేస్తూ బోల్డు నగలు, డబ్బూ సంపాదించాడట. అతని వద్ద నగలు తాకట్టు పెట్టిన చిన్నణన్ అనే ఒకతను తను తీసుకున్న అసలు మాత్రమే తిరిగి యిస్తానని, తన నగలు తిరిగివ్వాలని కోరాడట. దీనికి సుబ్రహ్మణ్యం ఒప్పుకోక పోయేసరికి యీ విషయం సర్కారు వారికి తెలియజేస్తానని బెదిరించిపోయాట్ట తను. దాంతో సుబ్రహ్మణ్యానికి భయం వేసి, తను దాచిన డబ్బు, నగానట్రా అంతా కూడా తన మామ గారింట్లో దాచుకొద్దామని మూటగట్టి తన 13 ఏళ్ళ కొడుకుని తీసుకుని రాత్రికి రాత్రి కాలినడకన తన మామగారివూరు బయల్దేరి, దారిలో దారితప్పి కాలుజారి తండ్రీ కొడుకులిద్దరూ నూతిలో పడి, చనిపోయారట. తెల్లారి పోలీసులు వారి శవాలతో పాటు పన్నెండువేల ఎనిమిదివందల యాభై తొమ్మిది రూపాయలే గాక, బోల్డు బంగారు నగలు కూడా బయటికి తీశారట.





## ఆగంతకుని అఘాయిత్యం

హైదరాబాదులో ఓ ఫ్యాక్టరీలో సూపర్‌వైజరుగా పని చేసే ఒకాయనింటికి ఓ ఆగంతకుడు మొన్న ఎనిమిదో తేదీ మిట్ట మధ్యాహ్నం (ఆయన ఆఫీసుకు వెళ్ళాక) వెళ్లి తలుపు తట్టి, తాను కరెంటు మీటరు రీడింగు చూడవచ్చిన వుద్యోగినని చెప్పి యింట్లోకి ప్రవేశించి, ఆ సూపర్‌వైజరు గారి భార్యను పీక నులిమి చంపి, యింట్లోవిలువైన దినుసన్నీ ఎత్తుకు పారిపోయాడట. స్కూలునుంచి ఇంటికి వచ్చిన ఆమె పిల్లలు తల్లి అలా పడుండటం చూసి అమ్మా అమ్మా అని కొన్నిపిలిచి, పలకక పోయేసరికి ఏడుస్తూ కూర్చున్నారట. దాంతో చుట్టుపక్కల వాళ్ళొచ్చి చూసి, విషయాన్ని చూసి పోలీసులకు తెలియచేశారట. చనిపోయిన ఆమె పేరు పెన్నమ్మట. మధ్య వయస్కురాలట. హైదరాబాదులో యిహముందు క్రొత్తరకం దొంగతనాలకు హత్యలకూ యిందో వారేమోనని జనం భయపడుతున్నారట. పోలీసు వారికి అభయమిస్తోందట.



'జీవనజ్యోతి' 'మహాపూరి గంగ' సినిమా కథా రచనకు ఆ వరుసలో ప్రభుత్వ అవార్డు అందుకున్న శ్రీమతులు కె.రామలక్ష్మి, యార్లగడ్డ సరోజినీదేవిలను విజయవాడలోని పలు మహిళా సంస్థలు కలిసి ఇటీవల సన్మానించాయి. అదే సందర్భంలో శ్రీమతి కె.రామలక్ష్మి, శ్రీమతి సరోజినీదేవి వ్రాసిన "బాంధవ్యాల"ను ఆవిష్కరించారు. మాట్లాడుతున్నవారు బాంధవ్యాలు రచయిత్రి. ఎడం ప్రక్కన నిలబడ్డవారు 'స్పీకర్' శ్రీమతి మోటూరి ఉదయం. కూర్చున్నవారు 'ప్రశాంతి' రామలక్ష్మిగారు.

# పద్మావతీ విలాస్



వి. వి. రమణారావు

రాత్రంతా వర్షం కురిసినట్టు ఉంది; నేలంతా చిత్తడి చిత్తడిగా ఉంది. రోడ్డుమీద ఉన్న మురికి గుంటలని దాటుకుంటూ శ్రీనివాసా కేఫ్ లోపలికి అడుగు పెట్టాను. గుమ్మంలో ఉండగానే 'రండి పంతులుగారూ! రండి!' అంటూ చెంగయ్య స్వాగతం పలికాడు. సుమారు పదిహేను సంవత్సరాలబట్టీ, ఆ ఆహ్వానం నాకు పరిచయమైనదే అయినా, ఇటీవల మాత్రం ఆ మాటలు వినగానే నాకు ఆహ్లాదం కలక్కపోగా ఏదో చిరాకు ముంచుకొస్తూంది. దానికి కారణం లేకపోలేదు మరి!

సెలక్షను గ్రేడ్ - టీచరుగా ఉద్యోగం రాగానే, పుట్టి పెరిగిన ఊరికి దగ్గరగా ఉంటుందని చెప్పి ఒంటిమిట్టపాలెం ట్రాన్స్ఫరు వేయించుకుని వచ్చేసాను. వచ్చాక గాని అక్కడ కాఫీ తాగడానికి ఒక మంచి హోటలు కూడా లేదన్న సంగతి నాకు తెలియలేదు. అసలు మొదట్నించీ కాఫీగత ప్రాణమేమో, ఒక వారం రోజులు మంచి కాఫీ దొరక్క విలవిలలాడి పోయాను. అలా విలవిల్లాడి పోతూన్న తరుణంలో, ఒంటిమిట్ట పాలేన్ని, పట్నానికి కలిపే రోడ్డులో ఊరికి చివరగా చెంగయ్య టీ కొట్టు ఆపద్బాంధవిలా అవతరించింది.

రేకులషెడ్డు. ఒకవేపు ఎత్తుగా కట్టిన సిమెంటు దిమ్మమీద చిన్న బాయిలరు. పక్కనే నాలుగైదు డబ్బాలు. మరొకవేపు నాలుగైదు బెంచీలు. పక్కనే రెండు పెద్ద కుండల్లో నీళ్ళు. మధ్యలో నల్లగా మకిలి పట్టి పోయిన అద్దాలు బిగించిన బీరువాలో ఉన్న పళ్ళాల్లో. కారప్పూస, పకోడి లాంటి ముడిసరుకు. కాస్తంత శుచీ, శుభ్రం పాటించే వాడెవడైనా ఆ బీరువా వేపు చూస్తే మరింక ఆ సరుకు ముట్టడు. అయితే చెంగయ్య అదృష్టం ఏమిటంటే, అతని ఖాతాదారుల్లో నేను తప్ప అలాంటివాళ్ళెవరూ లేరు. ఒంటిమిట్ట పాలెంనించి పట్నానికి రోజుకి సుమారు పది పదిహేను బస్సులు అటూ ఇటూ వస్తూ పోతూ ఉండేవి. ఆ వచ్చేపోయే బస్సుల డ్రైవర్లకి, ఫ్రీ కాఫీలు, టీలు ఇచ్చి బస్సులు అక్కడ ఆపించేసేవాడు చెంగయ్య. అరగంట బస్సు ఆగిపోతే, విసుక్కుంటూ ప్రయాణీకులు తప్పనిసరిగా దిగి చెంగయ్య కొట్లో టీ, కాఫీలు తాగేవారు. ఒట్టి కాఫీలు తాగలేనివారు, ఇంకేగి లేక,

ఆ నిలవసరుకు తెప్పించుకొని కాస్త తిని పోయే వారు. అయితే నేను మాత్రం ఆ అద్దాల బీరువావేపు చూడ్డానికి కూడా సాహసం చేసే వాడ్నికాదు. గుమ్మంలోనే ఉన్న కుర్చీలో కూర్చుని కాఫీ తెప్పించుకునేవాడ్ని. చిక్కటి పాలలో, బ్రూ కలిపి, చెంగయ్య నాకు స్వయంగా కమ్మటి కాఫీ కలిపి ఇచ్చేవాడు. అందుకే ఎంత దూరం అయినా సరే, సాయంత్రం అయేసరికి, చెంగయ్య హోటలు దగ్గరకు వెళ్ళక తప్పేదికాదు నాకు.

రానురాను ఆ రూటులో బస్సులు ఎక్కువయ్యాయి. జనం రద్దీకూడా పెరిగింది. దాంతో చెంగయ్య టీ కొట్టు సైజు పెరిగింది. క్రమంగా చిన్నహోటలు లేవదీసాడు చెంగయ్య. చెంగయ్య అదృష్టమో ఏమోగాని అతను పట్టిందల్లా బంగారం అవడం మొదలు పెట్టింది. ఒంటిమిట్టపాలెం ఊరు పెద్దదయింది. చెంగయ్య చిన్నహోటలు, పెద్దహోటలుగా మారిపోయింది.

శ్రీనివాసా కేఫ్‌లో ఎప్పుడు చూసినా కిటకిట లాడిపోయేవారు జనం. సుమారు ఇరవయిమంది సప్లయర్లు ఎప్పుడు చూసినా, విసుగూ విరామం లేకుండా వచ్చేపోయేవాళ్ళకి కాఫీలు అందిస్తూనే ఉంటారక్కడ. చెంగయ్యకు, అతనున్న ఇల్లుకాక, మరో మూడు మేడలు లేచాయి. ఎంత ఉచ్ఛస్థితికి పోయినా, చెంగయ్యలో మాత్రం మార్పులేదు. మనిషి ఎప్పటిలా అందరినీ, సాదరంగా ఆహ్వానిస్తూనే ఉంటాడు. అతనిలో కించిత్తు గర్వం గాని, అతిశయం గాని ఎప్పుడూ కనబడలేదు నాకు. అంతా బాగానేఉంది. అయితే మరి అతని మీద నాకు చిరాకు కలగడానికి కారణం ఏమిటి ?

ప్రతి మనుష్యుడిలోనూ ఏవోకొన్ని బలహీనతలు ఉంటాయి. తనకు ఇతరులు అన్యాయం చేస్తున్నారేమోనన్న బాధఉండటం, అందులో ఒకటి. అలాంటి బలహీనతే ఈ మధ్య నాకూ పట్టుకుంది. అయితే ఈ బలహీనత నాలో కలగడానికి, పరోక్షంగా చెంగయ్యకూడా కొంత కారకుడే.

మొదట్లో చెంగయ్య హోటల్లో ఇడ్లీలు, అంచెయ్యి మందాన ఉండేవి. నోట్లో వేసుకుంటే, కరిగి పోయేలా, వెన్నలా, మృదువుగా బాగుండేవి. అందులోకి ఘుమఘుమలాడే అల్లం చట్నీ, లేత కొబ్బరి చట్నీ నంచుకు తింటూంటే స్వర్గంలో ఉన్నట్లుండేది. కాని, రానురాను ఇడ్లీలసైజు తగ్గిపోయింది. అప్పుడే చెంగయ్య మొదటి మేడ కట్టాడు. మేడకట్టాక ఇడ్లీలసైజు తగ్గించేడో, ఇడ్లీలు సైజు తగ్గించాక మేడ కట్టేడో నాకైతే గుర్తులేదు గాని, నాకు ఎందుకో. నాడబ్బుకూడా పెట్టి చెంగయ్య మేడలు కట్టించేస్తున్నాడే అన్న దుగ్ధ బయలు దేరింది. చెంగయ్య రెండో మేడ కట్టేసరికి నాకు దుగ్ధకాస్తా మంట కింద మారింది.

'ఇదేమిటయ్యా, సైజు మరీ రానురాను తగ్గించేస్తున్నావ్?' అని అంతకీ నిలదీసి అడిగేసాను చెంగయ్యని, ఓసారి.

'ఏం చెప్పమంటారు పంతులుగారూ! మినప్పప్పు కిలో మూడు రూపాయలకి కూడా దొరకటంలేదు. ఇక కొబ్బరికాయల ధర మీరడగాలా? ధరలు అన్నీ మండిపోతూంటే మునుపటి సైజులో ఇడ్లీలు ఎలా సప్లయి చెయ్యమన్నారు చెప్పండి?'

నాకు ఆ సమాధానం విని ఒళ్ళు కుతకుతలాడి పోయింది. అంత లాభసాటి వ్యాపారం లేనివాడు మరో మేడ ఎలా కడతాడు?

అదిగో, అది మొదలు చెంగయ్య మీదా, చెంగయ్య హోటలు మీదా కూడా నాకు చిరాకు ముంచుకు రాడానికి.

రానురాను చెంగయ్య హోటలు మరీ దారుణం అయిపోయింది. భోజనంలోకి రెండు కూరలనించి ఒక కూరకి తగ్గించేసాడు సాంబారులో ముక్కలు అసలు కనపడేవి కావు. మజ్జిగ వాసన కొడుతూ ఉండేది. ఆభోజనానికే రెండు రూపాయలు ముక్కున వడేసినట్లు పుచ్చుకునేవాడు. అన్ని వస్తువులూ అది ఇదనడం దేనికి, సైజులు తగ్గించేసి రేట్లు పెంచేసాడు. అంతకీ ఒకసారి ఎవరో కాలేజి కుర్రాళ్ళు గొడవపెట్టారు. కాని ఎలాగో వాళ్ళని సర్దేశాడు. అప్పటినించీ యధేచ్ఛగా రాజ్యం ఏలుతున్నాడు చెంగయ్య.

అదేం ప్రారబ్ధమో గాని, శ్రీనివాసా కేఫ్‌కి, అటు ఫర్లాంగు దూరంలోనూ, ఇటు ఫర్లాంగు దూరంలోనూ ఇంకొక హోటలు ఏదీ రాలేదు. పోనీ సుమారు ఓ మాదిరి టిఫినైనా దొరుకు తుందేమో ననుకుంటే, చిన్న టీ బంకులు తప్ప మరేవీ లేవు. అక్కడ బిస్కట్లు తప్ప మరేవీ దొరకవు. అందుకని చెంగయ్య హోటలుకి వెళ్ళక తప్పింది కాదు నాకు.

నిస్సహాయత ఎక్కువైపోయిన కొద్దీ, నాకు చెంగయ్య హోటలు మీద కోపం ఎక్కువయి పోసాగింది అనాదిగా మనుషులలో జరిగే ఎక్స్‌ప్లాయిటేషన్‌కి చెంగయ్య ప్రతిబింబంలా కనిపించ సాగాడు. 'లాభంలేదు! చెంగయ్య అలా మనుషుల్ని పీల్చేసి లాభాలు గడించడం నేను సహించలేను. కాని ఏం చెయ్యాలి?' నాకేం తోచలేదు. అదిగో అప్పుడే ఒకరోజు...

'హోటల్ పద్మావతి, ఓపెనింగ్ షార్ట్‌లీ' అని తాటి కాయలంత సైజులో రాసి ఉన్న అక్షరాలు నాకళ్ళపడ్డాయి. ఎక్కడో కాదు సాక్షాత్తూ, చెంగయ్య హోటలు శ్రీనివాసా కేఫ్ పక్కనే. నాహృదయం ఆనందంతో నిండి పోయింది. ఎన్నాళ్ళకెన్నాళ్ళకు?

ఈ దెబ్బతో చెంగయ్య రోగం కుదరాలి.



అమెరికా అధ్యక్షునిగా ఎన్నికైన జిమ్మీకార్టర్ సతీమణి శ్రీమతి రోజాలిన్ ''వైట్ హౌస్'' కేకును కోసి పార్టీ యిస్తున్న దృశ్యం.

# పద్మావతీ విలాస్

అసలేఫీల్డులో నైనా కాంపిటీషను ఉండాలి. అప్పుడే ధరలు కాస్త అదుపులో ఉంటాయి. ఇది హోటళ్ళ విషయంలో మరీ వర్తిస్తుంది.

స్వయంగా దగ్గరకువెళ్ళి ఆ బోర్డుని తనివితీరా చూసాను. కూలీలు పని అప్పుడే ప్రారంభించారు. త్రవ్వకం పనులు చకచక జరిగిపోతున్నాయి. బళ్ళమీద ఇటుకలు, ఇసుక వచ్చిపడుతున్నాయి. అక్కడ పని జరిగే వేగం చూస్తూంటే ఇంకో నెలరోజుల్లో హోటలు ప్రారంభం అయిపోయేటట్టే ఉంది.

నాకు ఎందుకో మనశ్శాంతి కలిగినట్టయింది. ఇంక చెంగయ్యకు కొంచెం బెదురు కలుగుతుంది. ఎలా అయినా, పక్కనే మరో హోటలొస్తే సగం వ్యాపారం పడిపోయినట్టే కదా! అందులోనూ పక్కహోటలు బాగున్నట్టయితే,మొత్తం వ్యాపారంపడిపోయినట్టే.

'అవాల్సిందే' అనుకున్నాను కసిగా.

లేకపోతే మరీ అంత డబ్బు కక్కూర్తా! పది పైసలంత బరువు కూడా లేని ఇడ్లీలు, పదిహేను పైసల కమ్మడం, అలా వచ్చిన లాభాల్తో, మేడలు, మిద్దెలు కట్టించెయ్యడం, ఈ లోకంలో ప్రతివాడూ తన బాగుతను చూసుకునేవాడే. అందులో చెంగయ్య మరీ తెలివి మీరిపోయాడు.

ఆ రోజు నించీ, టిఫిను తినడం అయిపోగానే పోయి, ఆ కడుతున్న హోటల్ని పర్యవేక్షించి వస్తూండేవాడ్ని. ఎవడు కట్టిస్తున్నాడోకాని, ఏ మాట కామాటే చెప్పకోవాలి, చెంగయ్య కన్నా మంచి అభిరుచి ఉన్నవాడే ననిపించింది. విశాలమైన హాలు, చేతులు కడుక్కోడానికి వరసన ఆరు తొట్టెలూ, కళ్ళు జిగేల్మనిపించేలా లైటింగు అరేంజిమెంటూ;

ఆ హోటలు ముందు, చెంగయ్య హోటలు దివిటీ ముందర దీపంలా ఉంటుందనడానికి నాకేమాత్రం సందేహంలేదు.

'పాపం చెంగయ్య!' అనుకున్నాను.

నాకు చెంగయ్యమీద కొంచెం జాలి కలిగింది. ఏదో పాపం, కడుపు కక్కుర్తికొద్దీ డబ్బు సంపాదించాడుగాని, మనిషి నమ్రత, వినయం ఉన్నవాడే. ఇప్పుడు పాపం నష్టంలోకి దిగిపోతాడు కాబోలు. నా అంతరాంతరాల్లో ఎక్కడో చెంగయ్యంటే కొంచెం సానుభూతి ఏర్పడసాగింది. కాని మళ్ళీ నాకు జరుగుతూన్న అన్యాయం గుర్తుకి వచ్చినప్పుడల్లా చెంగయ్యకు ఆ శాస్తి కావలసిందేనని పించ సాగింది.

నా మనసులో ఆలోచనలు అలా ఉండగానే నెల రోజులు ఇట్టే గిర్రున తిరిగిపోయాయి. నే ననుకున్న శుభ సమయం రానే వచ్చేసింది. హోటల్ పద్మావతి ప్రారంభోత్సవం జరుగుతూన్నట్టు ఊరందరికీ కాయితాలు పంచి పెట్టేసారు. ఆ కాయితాన్ని నాలుగుసార్లు చదువుకున్నాను. ఆ కాయితం చదువుతూంటే ఎందుకో ఆ హోటలు నాదే అయినట్టూ, దాని ప్రారంభోత్సవం నేనే చేస్తూన్నట్టూ నాకు సంతోషం కలిగింది. అయితే ఒక గట్టి చిక్కు వచ్చి పడింది. ముహూర్తం బాగుందని ప్రారంభోత్సవం తెల్లవారుజామున మూడు గంటల ఇరవై నిముషాలకి పెట్టారు. అంత పొద్దున్నే లేచి నేను వెళ్ళడం సాధ్యం కాని పని. చివరికి మనసుని సమాధాన పరచుకుని రోజూ వెళ్ళే వేళకే వెళ్దామని నిశ్చయించుకున్నాను.

తీరిగ్గా ఏడు గంటలకి, రోజూకన్నా కొంచెం నీటుగా ముస్తాబై బయలుదేరాను. పద్మావతి హోటలుకి పోవాలంటే, చెంగయ్య హోటలుని దాటుకుని పోవాలి.

ఒకవేళ చెంగయ్య గుమ్మంలో నిల్చుని 'రండి పంతులుగారూ!' అని పిలుస్తాడేమో? పిలిస్తే మాత్రం, నా ఇష్టమొచ్చిన హోటలుకి వెళ్ళే హక్కు నాకుంది. మధ్యలో చెంగయ్య పిలిస్తే మాత్రం అతని హోటలుకి వెళ్ళాలని ఎక్కడుంది? అయితే, చెంగయ్య పలకరించి లోపలికి రమ్మంటే ఏం చెయ్యాలా అని కాసేపు ఆలోచించాను.

'ఏం చెయ్యక్కరలేదూ, ఓ చిరునవ్వు చెంగయ్య మీద పారేసి పోడమే' అలా అనుకున్నాను గాని చెంగయ్యను దాటుకుని వెళ్ళడం అన్నది, ఒక సమస్యలాగానే తోచసాగింది నా మనస్సుకి. చివరకి ఎలాగో ధైర్యం తెచ్చుకుని బయలుదేరాను. అనుకున్నట్టుగానే చెంగయ్య, శ్రీనివాసాకేఫ్ గుమ్మంలోనే నిలుచుని ఉన్నాడు. నా గుండెలు దడదడ కొట్టుకున్నాయి. 'కొంపతీసి లోపలికి పిలవడు కదా!' కాని చెంగయ్య పిలవలేదు. చూసి చిన్న చిరునవ్వు నవ్వాడు.

'ఎంత పొగరు!'పిలిస్తే, ఏం పోయింది ?

అయినా ఇలాంటి వాడి హోటలుకి నేనెందుకు వెళ్ళాలి? వెళ్ళడం శుద్ధ దండుగ.

బాపు రమణీయ రూపకల్పన
దేవులపల్లి, తుమ్మల, ఆరుద్ర, కొసరాజు, దాశరథి, నారాయణరెడ్డి కవిపుంగవుల
కమనీయ కవితా స్రవంతి...



సర్వలక్షణ సమన్వితమై, అతిలోకసుందరమైన
"సంక్రాంతి లక్ష్మి" స్పెషల్ సెట్టుకు
సముజ్వలాలంకారాలు
ఇతర సెట్లు కూడా ఇంతటి ప్రత్యేకతలు కలిగినట్టివే

# సృష్టి ఆర్ట్స్‌వారి సంక్రాంతి కార్డుల సెట్లు

| | రకానికొకటి చొప్పున | పోస్టేజితో సహా ధర |
|---|---|---|
| 1. సంక్రాంతి లక్ష్మి స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 10.50 |
| 2. యువతుల (విద్యార్థినుల) స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 3. యువకుల (విద్యార్థుల) స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 4. మహిళల స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 5. పురుషుల స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 6. గ్రామస్థుల సెట్ | 9 కార్డులు | రు. 7.50 |
| 7 బాలికల సెట్ | 9 కార్డులు | రు. 6.00 |
| 8. బాలుర సెట్ | 9 కార్డులు | రు. 6.00 |
| 9. ఎస్సార్టెడ్ సెట్ | 9 కార్డులు | రు. 6.00 |

## ప్రెజెంటేషన్ స్పెషల్ సెట్‌లు

*పండుగ సందర్భంలో శుభకామనలకు బదులుగా ఈ సెట్లను ఇస్తే, తీసుకునే వారు వాటిని గ్రీటింగ్‌గా పంపుకోవచ్చు. పరమానందం చేకూర్చగల కానుకలు.*

సంక్రాంతి ప్రెజెంటేషన్ సెట్ — రు. 30.00
(బాపు బొమ్మల కార్డులు 15)

సంక్రాంతి ఎస్సార్టెడ్ ప్రెజెంటేషన్ సెట్ — రు. 18.00
(అరుదుల చిత్రాల కార్డులు 12)

విజయవాడ,
హైదరాబాద్‌లలో సెట్‌లు అమ్మేవారు

మోడరన్ న్యూస్ ఏజన్సీ
బిసెంట్ రోడ్, గవర్నరుపేట, విజయవాడ

మోడరన్ స్టేషనరీస్
అబిద్ రోడ్, (జనరల్ పోస్టాఫీసు ఎదుట) హైదరాబాద్

*వీరిద్దరివద్దనుండి సెట్‌లు కొనుక్కోవచ్చు. పోస్టులో పంపే వ్యాపారం లేదు.*

*పోస్టుద్వారా సెట్‌లు తెప్పించుకోదలచినవారు మనియార్డరు పంపుతూ కింది చిరునామాకు మాత్రమే వ్రాయాలని గమనించాలి*



**Cards
Crafts
Classics**

"Rangam Bros." Buildings
13/1 General Patters Road
Post Box No. 2421 MADRAS-4
Grams: "CARDCRAFTS"

మాట్లాడకుండా చెంగయ్యను దాటుకుని పద్మావతి హోటలు లోపలికి అడుగు పెట్టాను.

కౌంటరులో ఎవరో ఇరవయిఏళ్ళ కుర్రాడు కూర్చుని ఉన్నాడు. చాకులా, అందంగా, తెల్లటి బట్టలతో మెరిసిపోతున్నాడు. చకచక అందరికీ ఏవో పనులు పురమాయిస్తున్నాడు.

# పద్మావతీ విలాస్

'అదీ! ప్రొప్రయిటరు అంటే అలా ఉండాలి!' అనుకున్నాను. కుర్రాడెలా ఉన్నాడో హోటలు కూడా అలాగే ఉంది. లోపలికిపోయి మంచి సీటు చూసుకుని చతికిల పడ్డాను. టిఫినుకు ఆర్డరిచ్చాను.

ఇడ్లీలు వెన్నలా ఉన్నాయి. మొదట్లో చెంగయ్య హోటల్లో ఉన్నట్లుగానే అరచెయ్యి మందాన దళసరిగా ఉన్నాయి. తళతళ మెరిసి పోతూన్న స్టీలు గిన్నెల్లో వేసిన అల్లపు చట్నీ, కొబ్బరి చట్నీ మహరుచిగా ఉన్నాయి సాంబారు ఘుమఘుమ లాడుతూ ఉంది. కాఫీ సంగతి చెప్పనక్కరలేదు. అమృతం లాగుంది.

నాకు చాలా సంతోషం కలిగింది.

ఇంక చెంగయ్య హోటలుకు ఎవ్వరూ వెళ్ళడు.

పైన ఫాను చల్లగా తిరుగుతూండటం వల్ల అక్కడే ఒక అరగంట చతికిల పడ్డాను. తర్వాత లేచి, బిల్లు చెల్లించడానికి, కౌంటరు దగ్గరకు వచ్చి, జేబులో చెయిపెట్టి పర్సు బయటకు తియ్యబోయాను.

'టిఫిను బాగుందా పంతులు గారూ!'

మాటలు విని ఉలిక్కిపడి కళ్ళెత్తి చూశాను. కౌంటరులో సాక్షాత్తూ చెంగయ్య! ఇందాకటి కుర్రాడెక్కడా పత్తాలేదు.

'చెంగయ్యా నువ్వా' అన్నాను ఆశ్చర్యపోతూ.

'అవును పంతులు గారూ! నేనే!' అన్నాడు చెంగయ్య.

'మరి ఈ హోటలు...' నసిగాను.

'మనదే పంతులు గారూ! కుర్రాడు పట్నంలో చదువు అయిపోయి ఊరికే ఉన్నాడు. తలమ్మకుని ఉద్యోగం ఎక్కడ చేసినా రెండొందలూ, మూడొందలే కదా! ఆ కాడికి ఇక్కడే హోటలు పెట్టుకుంటే పోలే! అని చెప్పి, ఈ హోటలు లేవదీయించాను. ఇంతకీ హోటలు బాగుందా పంతులు గారూ !'

చెంగయ్య ఇంకా ఏదో చెపుతున్నాడు. కాని నాకు వినపడలేదు. నా చూపు చెంగయ్య నిగాదనించి. చెంగయ్య నెత్తిమీద, అగరు బత్తులతో, దీపాలతో, ఘుమఘుమ లాడి పోతూన్న పూల దండలతో, వెలిగిపోతూన్న పటం మీదకు పోయింది. అక్కడ నాకు కనిపించిందేమిటి?

అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడూ, ఆపదమొక్కుల వాడూ, సర్వజగ ద్రక్షకుడూ అయిన ఆ శ్రీనివాసుని పక్కన చిరునవ్వులు చిందిస్తూ నిలబడి ఉన్న పద్మావతీఅమ్మవారు.

ఆ పటం చూడగానే నాకు సర్వ సందేహాలూ పటాపంచలయి పోయాయి. శ్రీనివాసుని, పద్మావతీ దేవినీ విడివిడిగా ఊహించినందుకు మనస్సులోనే చెంపలు వేసుకుని, బిల్లు చెల్లించి, చెంగయ్య దగ్గర సెలవు తీసుకుని బయటకు వచ్చేసాను. 

# వంటలు

## కట్టాడోగరా

కావలసిన వస్తువులు : ఒకకప్పు బియ్యం, అరకప్పు కందిపప్పు, అరకప్పు మినప్పప్పు, పుల్లని మజ్జిగ, తగినంత ఉప్పు, వంటసోడా, పోపు దినుసులు.

తయారుచేయు విధము : బియ్యం, కంది పప్పు, మినప్పప్పు కలిపి సన్నగా ఇడ్లీ రవ్వలా తిరగలితో విసరాలి. టిఫిన్ చేసే నాలుగ్గంటల ముందు ఈ రవ్వను, ఉప్పు, సోడా పుల్లమజ్జిగలో వేసి గరిట జారుగా కలపాలి. ఈ పిండితో ఇడ్లీలుచేసి, ముక్కలు కోయాలి. బాణలిలో కొంత నూనె, పోపుదినుసులు వేసి ఈ ముక్కల్ని వేసి వేగాక దించాలి వేడిమీద ఈ టిఫిన్ ఎంతో రుచిగా వుంటుంది.

## చౌ చౌ దోశ

కావలసిన వస్తువులు : బియ్యము, శెనగ పప్పు, పెసరపప్పు తలకొక కప్పు, తగినంత ఉప్పు, పచ్చిమిర్చి, జీలకర్ర.

తయారుచేయు విధానము : బియ్యం, పప్పుల్ని నానబోసి రుబ్బేటపుడు పచ్చిమిర్చి, ఉప్పు, జీలకర్ర వేసి మెత్తగా రుబ్బాలి. ఈ దోసెలు ఎంత పలుచగా కావాలన్నా పోసుకోవచ్చు చట్నీలతో కలిపితింటే మామూలు దోసెలకన్నా ఎక్కువ రుచిగా వుంటాయి !

## బంగాళాదుంప వడ

కావలసిన వస్తువులు : పావుకిలో బంగాళా దుంపలు, ఒక కప్పు శెనగపిండి, తగినన్ని ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, ఉప్పు, అల్లం, చిటికెడు సోడా, నూనె.

తయారుచేయు విధము: బంగాళాదుంపల్ని ఉడికించి పొట్టుతీసి రుబ్బాలి. ఉల్లిపాయ, పచ్చిమిర్చి, అల్లం సన్నగాతరిగి బంగాళా దుంప ముద్దకు చేర్చి శెనగపిండి, సోడావేసి బాగా కలియ పెట్టాలి. ఈ ముద్ద గట్టిగా ఉండాలి. దీనిని వడలుగా తట్టి దోరగా వేయించి వేడిమీద తింటే బావుంటాయి చల్లారితే బావుండవు !

— శ్రీమతి జి. వసుంధర.

## లోకం పోకడ









# హైదరాబాద్ నోట్ బుక్

(18వ పేజీ తరువాయి)

పరిశోధనకూడ అవసరమన్నారు. ప్రారంభంలో తెలుగు శాఖాధ్యక్షుడు డాక్టర్ బి రామరాజు వివేచన ప్రచురణకుగల కారణాలను వివరిస్తూ, తెలుగు శాఖకు ఇది గొప్ప సుదినమని, విశ్వనాథ సత్యనారాయణ స్మృత్యంకంగా వివేచన వెలువడిందన్నారు. ఆచార్య లక్ష్మీరంజనం ప్రసంగిస్తూ, తెలుగు శాఖను ప్రశంసించారు. ఆంధ్ర మహాభారతానికి విస్తృతమైన వ్యాఖ్యానం అవసరమన్నారు. అధ్యక్షత వహించిన ప్రిన్సిపాలు శ్రీ జి. రామరెడ్డి ప్రసంగిస్తూ, అత్యుత్తమమైన వ్యాసాలే ఈ సంచికలో ఉండాలని, దానికి సంపాదకమండలి అవసరమని అన్నారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి చివరన ధన్యవాదాలు చెబుతూ కళాశాలోపాధ్యాయుల సర్జనాత్మక కృషికోసం మరొక పత్రిక అవసరమన్నారు.

## బ్రిడ్జిలో ఆంధ్రప్రదేశ్ ఆధిక్యం

భారతదేశంలో బ్రిడ్జి క్రీడారంగంలో ఆధిక్యానికి పతాక రుంగయా బంగారు ట్రాఫీ దీనిని ఆంధ్రప్రదేశ్ బిడ్జి అసోసియేషన్ 1970నుంచి నెప్పాడుతున్నది. 1970 లో బెంగళూరులో జరిగిన పోటీలో ఈ అసోసియేషన్ రన్నర్స్ అప్‌గా వచ్చింది. 74 లో కలకత్తాలో జరిగిన పోటీలో ట్రాఫీ గెలిచింది. 75 లో రన్నర్స్ అప్పుగా వచ్చింది కాన్పూరు పోటీలో. ఈ సంవత్సరం డిసెంబర్‌లో బొంబాయిలో జరిగిన పోటీలో మరల ట్రాఫీ గెలుచుకుంది. నిరుడు కాన్పూరులో గెలిచిన భవానీపూర్ కర్జన్ క్లబ్ ఈసారి రన్నర్స్ అప్‌గా వచ్చింది. ఈసారి ట్రాఫీ గెలిచిన ఆంధ్రప్రదేశ్ బ్రిడ్జి అసోసియేషన్ 64 బోర్డులలో ఫైనల్స్‌లో 58 ఇంటర్నేషనల్ మాచ్ పాయింట్స్‌తో గెలిచింది. ఈ జట్టులో శ్రీయుతులు ఎస్. ఎం. కాద్రి, బి. ఎం. మాలాణి, మినాజ్ ఉల్‌హసన్, ముజుతబా హుస్సేన్, కె. వి. కృష్ణమూర్తి, అశోక కుల్కర్ణి ఉన్నారు. కృష్ణమూర్తి, కుల్కర్ణి చాల గొప్పగా ఆడారని స్థానిక దినపత్రికలు ప్రశంసించాయి. ఈ జట్టు కాప్టెన్ తెలంగాణా ప్రాంతీయ అభివృద్ధి సంఘం అధ్యక్షుడు శ్రీ వి. జగపతిరావు.

**ఉపశ్రుతి :**

"ఏ పద్ధతి ఆటమీది ?" అనడిగాడు ఒక బ్రిడ్జి క్రీడాకారుడు మరొక క్రీడాకారుణ్ని. "స్టాండర్డ్ అమెరికన్ పద్ధతి" అని జవాబు చెప్పాడు రెండో అతను. "వియత్నాం యుద్ధం తర్వాత అమెరికన్ స్టాండర్డ్ అనేది ఏముంది ?" అని ఎదురు ప్రశ్న వేశాడు మొదటి అతను. ●





# పండుగ ఆనందపు అంచునకు
# రంగుల మయమైన కో-
# వస్త్రాల పంట -ఆప్టెక్స్

ప్రతి పండుగ సమయాలకు, ఆ సందర్భానికి అనుకూలంగా ఎప్పుడూ కో-ఆప్టెక్స్ నిలబడుతుంది. మళ్లీ ఈ సంక్రాంతికని ప్రత్యేకత ఏంలేదు! ఆనందపరిచే రంగుల్లో, డిజైన్లలో సరికొత్త తయారీ విడుదలలు! ఒక రంగురంగుల డిజైనుల వస్త్రాల పంట కో-ఆప్టెక్స్ దగ్గర మీకోసం ఎదురుచూస్తూవుంది.

చీరెలు — యమున, అజంతా మరియు కాముండి. అద్దకాల చీరలు, కాంచీపురం, ఆరణి, కుంభకోణం నుంచి అసలు సిసలైన పట్టుచీరలు, వొరయూర్, కోయంబత్తూర్, సేలం, పరమక్కుడి, మదురై నుండి చేనేత చీరలు, సుగంది అద్దకాలు మరియు చిన్నాళపట్టి చీరలు.

పంచెలు. తువ్వాళ్లు—టర్కిష్ మరియు సాదావి, మెత్తగావుండేవి మరియూ బాగా తడిని పీల్చుకొనేవి!

పరుపు దుప్పట్లు—సరికొత్త విధానాల్లో అతి సున్నితంగా నేసినవి. తలగడ గలేబులు కూడా

లుంగీలు—డిజైన్లు లేనివి, వున్నవి. ఇంట్లో ఫర్నిచర్ సామగ్రికి మరియు మీ బట్టలకు వస్త్రాలు.....

**ఎప్పుడూ మామూలుగా ఉండే అరువు సదుపాయం**
**నెలసరి జీతాలు తెచ్చుకొనేవారికి!**

**20-1-1977 వరకు**

సంక్రాంతికి
ప్రత్యేక తగ్గింపు
నూలువాటికి **10%**
పట్టువాటికి **15%**




శలవు రోజుల్లోనూ, ఆదివారాల్లోనూ తెరిచేవుంటాయి 20-1-77 వరకు.

కో-ఆప్టెక్సు ఎంపోరియం, గోదావరి, స్టేషన్ రోడ్డు, సికింద్రాబాదు.



న్యూజిలాండ్‌లో పర్యటన చేస్తున్న భారత మహిళా క్రికెట్ బృందంలోని క్రీడాకారిణులు వెళ్ళేముందు డిసెంబరు పదవతేదీన ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీని కల్సుకున్నప్పుడు తీసిన చిత్రం. —(పి. ఐ. బి.)







# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

చాలా సంతోషిస్తున్నాము. "బంధం—సంబంధం, రైలు ప్రయాణము" కథలు బాగున్నాయి.

కె. యస్. యస్. (వరంగల్)

### ఉపశ్రుతి

తిరుమల రామచంద్రగారి హైదరాబాదులేఖలో చివరిగా వుంటువున్న "ఉపశ్రుతి" చాలా వినోదముగా విజ్ఞానముగా ఉంటుంది. నేను ముఖ్యముగా పత్రిక తెరచిన వెంటనే చదివేది తిరుమల రామచంద్రగారి హైదరాబాదు లేఖలోని 'ఉపశ్రుతి'

యద్దనపూడి వెంకటేశ్వర్లు, (మోచంపేట)

### జిన్‌సెంగ్

"జయమాలిని" ముఖచిత్రంతో వెలువడిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"లో "సర్వ రోగ నివారిణి జిన్‌సెంగ్" సైంటిఫిక్ విషయాన్ని తెలుసుకుని చాలా ఆనందించాము.ఇలాంటి సైంటిఫిక్ విషయాలు యింకా యింకా ప్రచురిస్తారని ఆశిస్తున్నాము.

పి. వి. రామనాథరావు, పి. శ్రీనివాసరావు, పి. వేణు
(నేలకొండపల్లి)


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street. Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**




## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి